

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## Journal of the Telugu Academy
## KAKINADA

కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రివర్యుల

## స్మారక సంచిక



1960
దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స


సంపుటము ౪౯ — Vol 49

సంచికలు-5,6 — Parts 5 & 6

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు

(జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు,)




# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**

సంవత్సరము చందా 3—0—0

సంపుటము ౪౯ శార్వరి—మార్గశిర. పుష్య, సంచికలు-**5.6**

Vol 49 మాఘ ఫాల్గుణములు Parts 5&6


## సంపాదకీయము

ఈ 49వ సంపుటము 5, 6 సంచికలు ముద్రితము కావలసి యుండఁగా, మా ఆంధ్ర సాహిత్య పరిషత్తునకు ఇంచుమించుగ పది వత్సరములనుండి అధ్యక్షులుగానుండిన కవిసార్వభౌములు, మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు, ఆంధ్రప్రదేశ ఆస్థానకవిశ్వరులు అయిన బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు దివంగతులైనారు. వారాశ్వాసాంతము గ్రాంథికభాషా సముద్ధరణమునకై యఖండ కృషి సాగించిన మహాపురుషులు. అట్టి కృష్ణమూర్తి శాస్త్రిగారి సంస్మరణార్థముగా, వారియెడఁ బరిషత్తునకుఁగల కృతజ్ఞతను దెలుపుటకయి ఈ 5, 6 సంచికలను వారిస్మారక సంచికగా వెలువరింపఁదలంచితిమి. అందుచే నీసంచికలు వెలువడుటలో విలంబమయినది. పాఠకులు మన్నింతురుగాక,

ఇట్లు,

సంపాదకుఁడు.

# విషయసూచిక

తే.గీ. వేదవిద్యా విశారద! విబుధవర్య!
ఆర్య! అభినవ శ్రీనాథ! ఆంధ్రవ్యాస!
కవులకెల్లను రాజవై గ్రాలినావు
సుకృతి శ్రీపాదకృష్ణమూర్తి కవిచంద్ర

సీ. సర్కారువారిడు సరసమహామహో
పాధ్యాయబిరుదుచే వఱలినావు
శ్రీయాంధ్రయూనివర్సిటిచే తసత్కళా
పరిపూర్ణ బిరుదము వడసినావు
నీప్రతిరూపంబు నెలకొల్పఁబురజనుల్
చిరకీర్తిచే విరాజిల్లినావు
పండితరాజన్య బహుమానములనంది
యేనుగునెక్కి యూరేఁగినావు

తే.గీ. గ్రంథములు నూటయేఁబదిగా రచించి
ఘనకవుల మెప్పులను జెందఁ గలిగినావు
ధన్యుఁడవు నీదుచరితంబు తరమెపొగడ
సుకృతి! శ్రీపాద కృష్ణమూర్తి కవిచంద్ర!

వీరి కవితయందలి ప్రాచీనత, భావమునందలి విశిష్టత, పద ప్రయోగ వైచిత్రి, పాత్రోచితసంభాషణ, ఐతిహాసిక నేయప్రవృత్తి, ధర్మసూక్ష్మ చతురత్వము. పారమార్థిక భావనా బలము, వయః పరిణతోపజ్ఞత, అను గుణమణులు ఏతత్కవితా ఖనిజములు.

పురాభవసుకృతోపలబ్ధిఁ గవితా ప్రథమావతారమగు నన్నయ నాత్మజునిగాఁ బడసిన రాజమహేంద్రపురము మగిడి వరప్రసాది, శతాధిక గ్రంథకర్తను దనయునిగాఁ బడసి సార్వభౌమ పట్టభద్రునిఁగావించి మురిసిపోయినది.

కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, కవిచంద్ర,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి అస్తమయము.

గీ॥ ఎన్నియో సభలందున వన్నె కెక్కి
పెక్కు గ్రంథములను జెప్పి పేరుచెంది
ఆంధ్ర సంస్థాన కవివయి యలరి తుదకు
దివికి నరిగితె బుధులెల్ల దిగులు నడఁగ

గీ॥ దివిజపతి సభలోనింక దీప్తిమీఱఁ
గవివతంసుఁడవౌచు నాకమునఁ గీర్తి
చెంది సుఖముల నెన్నియో పొందుమయ్య
సుకృతి! శ్రీపాద కృష్ణమూర్తి కవిచంద్ర!

నేఁటి వీరి యస్తమయము మన యాంధ్రలోకమునకుఁ దీఱని కొఱఁత. వారి యాంధ్రకవితా సేవకు నాంధ్రులెల్ల రంజలి ఘటించుటయే మా యభిజ్ఞుని యుచితజ్ఞతను వెల్లడించును. వీరి పరమపద ప్రాప్తి కవితామతల్లికి దుర్భరము. వీరి యాత్మకుఁ బరమేశ్వరుఁడు శాంతి నొసంగుఁగాక.

---

## శ్రేష్ఠలూరి వేంకటార్యుఁడు; శ్రీనివాస విలాస సేవధి.

(శ్రీ వేదాంతము గోపాలకృష్ణమాచార్యులుగారు ఎం.ఏ)

షష్ఠాశ్వాసపరిమితమగు నీ ద్విపదకావ్యమును రచించిన శ్రేష్ఠలూరి వేంకటార్యుఁడు భారద్వాజ గోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. తండ్రి శ్రీ కృష్ణయార్యుఁడు, తల్లి లక్ష్మి. శ్రేష్ఠలూరనంతపుర మండలములోని చెట్లూరు కావచ్చును. ఈతఁడు

'విలసత్సరోజాక్షు వేంకటాధ్యక్షు
నలిమేలు మంగమ్మ నర్మిలిఁ గొల్చి

శేషాహి సౌపర్ణ సేనాధిపులకు
శేషతన్ మ్రొక్కి యశేష దేశికుల
కెఱఁగి సాష్టాంగంబు నెలమి
వఱలఁగ వాధూల వంశాబ్ధిసోము
వాచాతిగ జ్ఞాన వైభవునస్మ
దాచార్యు నన్నావి యప్పలాచార్యు
భజియించి వాల్మీకి బాదరాయణుని
సుజన సమ్మతులైన సుకవివర్యులను
బేర్కొని పొగడి యభీష్ట సిద్ధికిని
గోర్కులుబ్బ రసజ్ఞ కోటి సంతసిల
నొక కావ్యమొనరింప నూహఁదలంచి
యకలంక సత్ఫలం బొదవుచుండఁగ’ పుటలు 4, 5

వేంకటాచలాధిపుఁడగు శ్రీనివాసుఁడు స్వప్నమున నాతని కిట్లని

‘ధర సంస్కృత ప్రాకృత ముఖభాషలను
ద్రవిడాంధ్రములఁ బ్రబంధము లెన్నియైన
సవరించితివి నాకు సంతసంబెసఁగ
నొకకృతి శేషాచలోరు వైభవము
ప్రకటితాలంక్రియా స్పదవర్ణనలను
విసువక శృంగార వీరాద్భుతాది
రసములు భావముల్ రంజిల్లునట్లు
ద్విపదలోకుల కెల్లఁ దెలివిడిగాన
ద్విపదగాఁ దెలుఁగునఁ దేటగావించు’ పుటలు 5, 6

మని యానతిచ్చినాఁడు. గ్రంథమట్లే గోవిందరాజున కంకితముగ రచింపఁబడినది.

వితత తేజునకు గోవిందరాజునకుఁ
బూని సమర్పితంబుగ నేనొనర్చు

శ్రీనివాస విలాస సేవధియందు-పుట 10
గోవిందరాజ ముకుందుని పేర-పుట 76
కోటి భాస్కర తేజ గోవిందరాజ-పుట 77
గోవిందరాజ ముకుందుని పేర-పుట-131
కోవిదసుర భూజగోవిందరాజ-పుట 133

ప్రభృత్యాశ్వాసాద్యంతసంబోధనముల వలన గ్రంథముదిగువ తిరుపతిలో వెలసిన గోవిందరాజున కంకితముగా వెలయింపఁబడినదని గ్రహింపనగుచున్నది. ఈతఁడు సంస్కృత ప్రాకృత ద్రవిడాంధ్రముల యనేక కృతులు రచించినట్లు స్వప్నమున సాక్షాత్కరించిన శ్రీనివాసుఁ డనుటచేఁగాని నేఁటికిఁ బ్రకృతగ్రంథముదక్క నేతఁడొండేతని రచనము గనుపట్టలేదు.

ప్రకృత కవికి వాధూల వంశావతంసుఁడగు నన్నావి యప్పలాచార్యులు దేశికుఁడైనట్లు కృత్యవతరణికచే స్పష్టమగుచున్నది. ఈయనకే కందాడై కోపిల అణ్ణాన్ అని ప్రసిద్ధి. తెనాలి రామకృష్ణుని సమకాలికులను గూర్చి చేసిన సుదీర్ఘ విచారమునకు ఫలితముగా శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు.

"పైఁజెప్పిన విషయములన్నిటిని సమకూర్చి యోచించఁగాఁ గందాళె అప్పలాచార్యులను పేరుగల వైష్ణవ గురువు క్రీ. శ. ౧౫వ శతాబ్దాంతమున ఎనుములపల్లి నారననాయకులకును, దరువాత ౧౬వ శతాబ్ది పూర్వార్ధమున విరూరి వేదాద్రి మంత్రికిని, కడపటఁ దచ్ఛతాబ్దాంతమున గోలకొండ కరణము సారంగు తమ్మయకును, రామానుజ సిద్ధాంతము బోధించుచుండెనని తెలుచున్నది. భిన్న దేశజులును భిన్న కాలికులునగు వీరందఱికిని వైష్ణవ మతమును బోధించుచుండిన యప్పలాచార్యుఁడేక వ్యక్తియా. కాక ఏక నామధారులగు భిన్నపురుషులా అను విషయము విచారణీయము. దాదాపు నూతేండ్లను మించిన

కాలమున అనిమెలయందును, నోరుగల్లు గోలకొండలలోను మత పరిచారము గావించుచుండిన యప్పల గురువేకపురుషుఁడని నమ్ముటకు సాధ్యముగాకయున్నది. క్రీ. శ. ౧౫వ శతాబ్దాంతమునందుండిన యప్పళాచార్యుఁడొకఁడు, ౧౬వ శతాబ్ద పూర్వార్ధముననుండిన వాఁడు మఱియొకఁడు, తచ్ఛతాబ్దాంతిమ వర్షములనున్న యాతఁడింకొకఁడు-ఇట్లు అప్పళాచార్య నామాంకితులు ముగ్గురు గురువులుండి యుందురని తోఁచుచున్నది''1

యను రాద్ధాంతమునకువచ్చి దానికి శాసనరూపమైన సాక్ష్యమును ప్రదర్శించినారు. ప్రకృతకవి యనంతపురమండలమునకుఁ జెందినవాఁడగుటచే కంబంమెట్ట సూరుగల్లు, మొదలగు పట్టణములకధిపతియగు చిత్తాపఖానుని యమాత్యుఁడును, చిత్రభారత కృతిపతియునగు నెనుమలపల్లి పెద్దనయొక్క తండ్రికిని బెద్దతండ్రికిని గురువైన కందాళ అప్పలాచార్యులతో నీతనికి సంబంధము భావ్యముగాదు. తిరుమల తిరుపతి దేవస్థాన శాసనములలోఁ గందాళ అప్పలాచార్యుని ప్రసక్తి గానవచ్చుచున్నది. శాలివాహనశకము 1438 ధాతృనామ సంవత్సరమునకు సరియైన

క్రీ. శ. 1516 సంవత్సరమునాఁడు తిరుమల స్థానమువారు తిరువేంకటనాథుని పూలతోఁట కధికారియగు కేత్వే తిరువేంకటనాథజీయరుపేర గోవిందరాజ స్వామ్యాలయమునఁ జెక్కించిన యొకశాసనమునఁ గందాడై అప్పన్ పేర్కొనఁబడినాఁడు.[2] శాలివాహనశకము 1469 ప్లవంగనామ సంవత్సరమునకు సరియైన క్రీ. 1547 వ సంllనాటి

1. తెనాలి రామకృష్ణుఁడు-అతని సమకాలికులు
శ్రీ డా. నేలటూరి వేంకటరమణయ్య
భారతి. మార్చి 1941 పుటలు 321-337.

2. తి. దే. శా. సంపుటము 3 పుట 234

శాసనమునం దొకదానియందు వాధూలగోత్రజుఁడును, యజుశ్శాఖా ధ్యాయియు నాపస్తంబ సూత్రుఁడును నగు కందాడై అప్పన్‌గారి పుత్త్రుఁడైన యప్పన్నగారు శ్రీవేంకటేశ్వరుల యమృతపడికినగరిసీమ లోని పుణ్యగ్రామమున సగపాలు దానముచేసినట్లు చెప్పఁబడినది. [3] పై శాసనములందుదాహృతుఁడైన కందాళ అప్పలాచార్యుఁ డీవేంక టాధ్వరి దేశికుఁడైనచో నాతనికాలము పదునాఱవశతాబ్ది పూర్వార్ధమని నిర్ణయింపవచ్చును.

స్వప్నమున సాక్షాత్కరించిన శ్రీనివాసుఁడు
'వారాహ వామన బ్రహ్మాండపాద్మ
గారుడస్కాంద మార్కండేయ ముఖ్య
బహుపురాణోక్తి సంబంధంబువలన
గహనమై పెనగొన్నకథ చిక్కుదీర్చి
శరధిలోఁగల రత్నజాతంబు లేర్చి
మెఱుఁగు సానదీర్చి మెలఁకువన్ దిద్ది
భూషణంబొనరించు పుట 6

నుః యాజ్ఞాపింపఁగాఁ గవి
'వారాహ వామన బ్రహ్మాండపాద్మ
గారుడాది పురాణ కథలు శోధించి
కసటుదీర్చి ప్రసిద్ధకథ సంగ్రహించి
వెస విచిత్రకథ చాల విస్తృత ఫణితిఁ
గరయించి పునరుక్తి కథఁద్రోచి మొదలు
తుద యేర్పరించి బంధుర సంగతులను
పూర్వోత్తర విరోధములు దోఁచనీక
సర్వ సమాధాన సరణిదీపింప
ఘటియించి తగు నలంకారముల్ గలుగ

3. తి. దే. శా. నివేదిక పుట 295

నతుల శృంగార వీరాద్భుతరసము
లతిశయించఁగ విభావాది భావములు
భావుకభావ్య సంభావ్యత నలరఁ
గావించి పటు మహాకావ్యలక్షణము
వెలయఁ దెనుంగున ద్విపదకావ్యముగ
నల వేంకటాద్రి మాహాత్మ్యమింపొంద
శ్రీనివాస విలాస సేవధియనఁగ
భూనుత విఖ్యాతి పొసఁగ' పుటలు 6, 7
సల్పినాఁడు కావ్యాంతమున
'వరుసగా వారాహవామనపద్మ
గరుడ పురాణాది కథితమార్గమున' పుట 374

వేంకటాద్రీశుని భువనాద్భుత చరిత్రమును సంగ్రహించి హృద్యదగాఁ దీర్చినట్లు కవి వక్కాణించినాఁడు. వారాహపద్మ గారుడ మార్కండేయ హరివంశపర్వ వామన బ్రహ్మాదిత్య స్కాంద భవిష్యోత్తర శ్రీ వేంకటేశ్వర రహస్య పురాణములలోఁ గనవచ్చుచున్న వేంకటాచల మాహాత్మ్య వర్ణనాత్మక భాగములు సంకలితములై తిరుపతి దేవస్థానము మహంతుచే వేంకటాచల మాహాత్మ్యమను పేర రెండు వాల్యూములుగా నొక గ్రంథము ప్రకటితము. సంకలనకర్త యెవ్వరో తెలియరాదు. ఈ గీర్వాణ భాషారచిత సంకలన గ్రంథమున నాయా పురాణభాగములుగాఁ జేర్పఁబడిన రచనములు మూల పురాణములలోఁ గానవచ్చుటలేదు. ఈ కారణముచే నీ భాగము లాయా పురాణములందు భిన్నకర్తృకములై భిన్నకాలములందుఁ జేర్పఁబడి యుండవచ్చునని యెంచఁదగును. వేంకటాచార్య కవి కాలమునకు ననఁగా క్రీ. 16వ శతాబ్దినాఁటికి వారాహ వామన బ్రహ్మాది పాద్మ గారుడస్కాంద మార్కండేయములను నేఁడు పురాణములలో

వేంకటాచల మాహాత్మ్య వర్ణనాత్మక భాగములు గన్పట్టుచున్నవని మాతఁడు స్పష్టీకరించుటచే నిర్ణయింపవచ్చును. క్రీ. 19వ శతాబ్ది పూర్వార్థమునకుఁ జెందిన తరిగొండ వేంకమాంబ వరాహ భవిష్యోత్తర పద్మపురాణములందలి కథలనుగ్రహించి తెలుఁగున వేంకటాచల మాహాత్మ్యమును వెలయించినది. సంకలిత వేంకటాచల మాహాత్మ్యమందలి యాయా పురాణభాగముల కామె రచనము స్పష్టముగా ననువాదమని పరిశీలనమునఁ దేలుచున్నది.

ప్రకృతకవి "పునరుక్తి కథఁ" ద్రోచి యెట్లు "చిత్రకథ చాల విస్తృతఫణితిఁ గదియించి" నాఁడో చూడవలసియున్నది. ప్రథమాశ్వాసమున వేంకటాచల శృంగాంతరముననాది వరాహము వెలయుట 'వరాహ పురాణ సరణి' (పు 32) వర్ణింపఁబడినది. 'మునుపు వాల్మీకి సన్మునిి యానతిచ్చు' (పు 72) ప్రకారమున స్వామి పుష్కరిణీప్రభావము వర్ణింపఁబడినది. వేంకటాచల మాహాత్మ్యమందలి వారాహ పురాణ ప్రథమ భాగమందలి షష్ఠాధ్యాయముననేఁ బది రెండు శ్లోకములలో స్వామి పుష్కరిణీప్రభావమున రాజ్యభ్రష్టుఁడైన శంఖునకు రాజ్యము తిరిగి ప్రాప్తించినవిధము వర్ణింపబడినది. ఆ కథను బెక్కువిధములఁ బ్రకృత గ్రంథకర్త విస్తరించినాఁడు.

అథభ్రష్ట రాజ్యస్యశంఖణ నృపస్య రాజ్యప్రాప్తిక్రమః—ఈయధ్యాయము క్రిందిశ్లోకములతోఁ బ్రారంభమగుచున్నది.

వాల్మీకినా మునీంద్రేణ, కించిదుక్తం శ్రుతంమయా
తదుచ్యతేమయాయాయాయం, శృణుధ్వం మునిసత్తమాః 6-1
సాంగాశ్యే సోనువంశీయం, శంఖణః పృథివీపతిః
అనేక దేశసహితం, బహువిస్తార సంయుతమ్ 6-2
రంపరాగతం రాజ్యం, చక్రేఽఖణ్ణపరాక్రమః
సకదాచిన్మహారాజః తత్పుణ్య విపర్యయాత్ 6-3

సామన్తరాజభిః సర్వైః, హృతరాజ్యో మహీపతిః
తస్మాత్సభార్యః సామాత్యో దేశాన్నిర్గత్య దుఃఖితః 6-4

(ప్రియాగదాసజీ ప్రచురించిన వేంకటాచల మాహాత్మ్యము-వాఙ్మ్యము వారాహ పురాణాంతర్గతవేంకటాచలమాహాత్మ్య ప్రథమ భాగము.) వేంకమాంబ

వాల్మీకినాకుఁ బూర్వచరిత్ర మొకండు
చెప్పెదానిని వినుఁ డొప్పుగాను
చంద్రవంశజుఁడైన శంఖణుండనురాజు
కాలవశంబున బేలయగుచుఁ దన

శత్రులకు రాజ్యమును గోలుపోయి' (వేంకటాచలమాహాత్మ్యము 1-157) యని యాంధ్రీకరించినది. ప్రకృతకవి, కాశినిమించు సాంకాస్యాఖ్య, పురిని రాజ్యపాలన కళారక్తుఁడై ప్రజలఁ' (పు 37) బాలించుచున్న చంద్రవంశ్యుఁడగు శంఖణుని గుణములను విపుల ముగాఁ గీర్తించినాఁడు. తరువాత మాళవాధిపుఁడగు విజయుఁడు కూఁతునకు స్వయంవరము చాటించి రాజుల నందఱరావించుట, కలవాణియను నొక్కదాది మంచకోపరిస్థితులైన నృపాలురవైభవ మును వేర్వేఱనామెకు వర్ణించుట, తుదకామె శంఖణుని వరించుట, మాళవాధ్యక్షకన్య యాతని దనమునిఁ బతిగా వరించి

"ఈ క్షణోత్పల దామమెసగంగఁ బూన్చి
లక్షిత మధుక మాల్యంబును వైచు" పు 48

టయను నమూలక భాగములు నెలవు చేసికొన్నవి. ద్వితీయ తృతీయా శ్వాసముల స్వామి పుష్కరిణీ ప్రభావ సంసూచకమగు నాత్మా రాముఁడను బ్రాహ్మణునికథ, పదునేడు తీర్థముల ప్రభావ వర్ణనముః వైకుంఠ గుహామహిమ వర్ణనము, రావణునిచే బాధితులగు మునులు ధాతతో మొఱలిడి యంతనితోఁ గలిసి శేషశైలమునకుఁజని స్వామి

పుష్కరిణీ తీరమున శ్రీనివాసుని సాక్షాత్కారము కొఱకు తపస్సు సల్పుట, శ్రీనివాసుఁడు సాక్షాత్కరించి బ్రహ్మ ప్రార్థనముచే వేంకటాద్రి వెలయుట, చక్రరాజు రాక్షసులను జెండాడుట, బ్రహ్మ శ్రీనివాసునకుఁ బలు తెఱఁగులనుత్సవములు సల్పుట కానవచ్చుచున్నవి. సూతుఁడు

"వినుఁడింక నద్భుత వృత్తాంతమొకటి
ఘనుఁడు జైమినిదెల్పఁగా వింటియున్న
స్వామి పుష్కరిణి కీశాన్యదిక్కున
గోముండు వైకుంఠ గుహాయన నొకటి" పు 97

యనియుఁ "దనగురునిఁ దలంచి తగు పురాణములు,వసిసి యూహించి (పుట 105) చెప్పుచున్నాననియుఁ బల్కుటచే నీ కథ లీపురాణమునుండి గ్రహించినాఁడనని కర్త చెప్పలేదని స్పష్టము. ఈ కథలన్నియు వరాహ పురాణాంతర్గములని గీర్వాణ వేంకటాచలమాహాత్మ్య పరిశీలనమునఁ దెల్లమగుచున్నవి. నాలవ యాశ్వాసమునఁ దీర్థాదుల మహిమలు, వానినిగూర్చిన కథలు వామన పురాణోక్తరీతిని (పుట 177) వర్ణింపఁబడినవి. గీర్వాణ వేంకటాచల మాహాత్మ్యమందలి వామనపురాణభాగముతోనవి సంవదించుచున్నవి. చతుర్థాశ్వాసాంతమున వేంకటాద్రికి వివిధ నామములు కలుగుటకుఁగల కారణములు సంక్షేపముగా నుక్తములైనవి. తరువాత

"పటు పాపరాశి వేంపద వాచ్యమగుట
కటదాహనే యనఁగల్గు నర్థమున
తతపాపములనెల్ల దహియించుకతన
క్షితినిదే వేంకటగిరి యనందనరె" పుట 240

నని చెప్పఁబడి తన్నిరూపకముగా మాధవ సోమయాజి కథ వివరింపఁబడినది. ఈ కథ బ్రహ్మాండ పురాణమునుండి గృహీతమని

"అలమునీంద్రులకు బ్రహ్మాండ పురాణ
కలన సూతుఁడు దెల్పె కమనీయ ఫణితి" పుట 248

అను పంక్తులచే స్పష్టమగుచున్నది. భవిష్యోత్తర పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యమునను వేంకటాచల నామ నిష్పత్తి ప్రకారమును వివరించు సందర్భమున మాధవ సోమయాజి కథ కానవచ్చుచున్నది. (అధ్యా 1-140-239). ఈ కథ బ్రహ్మాండ పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యమున నాఱవ అధ్యాయము. ఆ యధ్యాయము మీఁది శ్లోకములతోఁ బ్రారంభము.

"శ్రీగిరేః పశ్చిమే భాగే పురం నందనసంజ్ఞకమ్
హస్త్యశ్వరథసంబాధమ్ బభూవ భువివిశ్రుతమ్ 6-3
పురందరాభిధః కశ్చిత్ సోమయాజీ ద్విజోత్తమః
ఉవాస తస్మిన్నగరే, యాజకో వేదపారగః 6-4
తస్య జజ్ఞేఽతి మతిమాన్ పుత్రో మాధవసంజ్ఞకః
కాలక్రమేణ వవృధే వేదాధ్యయన తత్పరః 1-5
శ్రీశైలమునకుఁ బశ్చిమమున నాంధ్ర
దేశభాగంబునఁ దిరముగా నొక్క
పురము నందన మన భూరి సంపదల
వఱలుచు రథదంతి వాజి సద్భటులు
నెగడ చాతుర్వర్ణ్యనిలయమై జగతిఁ
బొగడొందుచుండు నప్పుర రత్నమునను
దనరు నెప్పుడు పురందర సోమయాజి
యను నొక్క బ్రాహ్మణుం డతిధర్మపరుఁడు
నిర్మల షట్కర్మ నిరతుఁడౌ నతని
కర్మిలి దనరంగ నాత్మజుం డొకఁడు
జనియించె మాధవ సంజ్ఞకుఁడగుచు" పుట 30, 41

అతఁడు వసంత ప్రాదుర్భావసమయమున ధర్మపత్నియగు చంద్రరేఖతోఁగూడి వనవిహారము సల్పుచు విరిదోఁటలోఁ జెలఁగు కాసారముచెఁగట నార్తవస్నాన మాచరించి నిలిచిన మాలిని యను మాతంగకన్యకనుగాంచినాఁడు. ఈ విషయము మూలమునఁ గ్రింది ప్రకారముగా వర్ణింపఁబడినది.

"చండాల కన్యకాం తన్వీం దదర్శ సుమనోహరామ్
ఇందీవర దళశ్యామాం ప్రఫుల్ల కమలేక్షణామ్" 6-17
పీనోన్నతకుచాంతన్వీం పూర్ణచంద్రనిభాననామ్
మూర్తామివాజ్ఞాం మారస్య సుస్నిగ్ధ కుటిలాలకామ్ 6-18
తనుమధ్యాం వరారోహాం మాలినీం నామనామతః
తాంధృష్ట్వా విస్మయా విష్టశ్చింతయామాసవైద్విజః 6-19

ఆంధ్రీకర్త మూలభిన్నముగా నామెను వర్ణించినాఁడు.

" ఆ విరిదోఁటలో నలరు చెంగల్వ
బావులఁ దావులు పరిఢ విల్లంగఁ
జెలఁగు కాసారంబు చెంగటనొక్క
అలివేణి మాతంగి యార్తవస్నాన
మొనరించి రుచిరనీలోత్పల లక్ష్మి
వనితయై కొలను వెల్వడినిల్చు పగిది
నిలిచి తుమ్మెద గుంపు నెమ్మెనితావి
కలరి వెంబడివచ్చునటుల పెన్నెఱుల
కీలుగంటురహింప గెంపు దీపించు
దాళింబ విరిచాయఁదగు చంద్రకావి
వలిపెంబు ధరియించి వలుఁదచన్దోయి
జిలుగుమేల్ రవికగైసేసి గుత్తముగ
వెలిచి పుత్తళిసగల్ వెలయంగఁ బెట్టి

నలికట్ల దండలు నలువొప్పఁదాల్చి
సంకుము త్తియముల సరులు కంఠమున
పొంకంబుగాఁబూన్చి పోల్పనవ్వేళ
నలసంజ కెంజాయ లావరింపంగ
పలచగాఁ జీఁకటి పైపైఁజెలంగ
మొలక చుక్కలగుంపు మొనసిన సంధ్య
పొలుపువ నయ్యెంచుబోణి రాణించె" పుటలు 243, 244

మూలమున ద్విజకుమారకుఁడు మాతంగీసంగసముద్భ్వాత మగు మహాపాపమును విచారింప కామెకడకుఁ జని (అవిచార్య మహాత్పాపం తత్సంగసముద్భవమ్ 6-27) క్రింది విధముగాఁ బల్కినాఁడు.

మా భైషీస్త్వం వరారోహే ద్విజోఽయ మితిభామినీ
స్త్రీరత్నమ్ దుష్కులాచాపి గ్రాహ్యా మిత్యనుశాసనః 6-28
అతోఽహం భవతీం యాచేవాచా మధురపూరయా
మమచానుమతిం దాతుం త్వయార్హంతు మిహార్హసి 6-29
ఇత్యుక్త్వా పాణిమస్యావైస్వేన్నం జగ్రాహపాణినా
సంగతఃసోఽథమాలిన్యా తయా ద్విజకుమారకః 6-30

ఆంధ్రీకరణమున మాధవుఁడామె చెంతకుఁ జేరి
'పనిఁబూని దీవింతు బాహ్మణోత్తముఁడ
తరుణీ లలామనీదయకుఁ బాత్రుఁడను
మరుకేళిననుఁగూడి మన్నింపఁగదవె' పుట 245

అనుటయు నామాతంగి యులికి

'వెనుకకుఁ జని కొంత విను బాపనయ్య
నొద్దికి రాకందెయుండు దోసంబు
పెద్దకులము దాన పెక్కులేమిటికి
మాలదానికి నీవు మరులొందఁదగునె

పాలుమాలిన వెట్టి బాపన వాఁడ
యెంత పాపముగట్టు నెంచినావిపుడు
చెంతకురాక విచ్చేయు' పు. 245

మని ధర్మోపదేశము గావించినది. ఈధర్మోపదేశము మూలమునఁ గనరాదు. భవిష్యోత్తర పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యమున మాతంగకన్యపలు తెలుఁగుల మాధవుని దుర్వార కామమును వారించుటకుయత్నించి విఫలమైనది. తుదగామె

'పరస్త్రీ సంగ దోషేణ, బహవోనరకాన్ గతాః' 1—17

యని సైతము హెచ్చరించినది. ఇఁకఁబంచమషష్ఠాశ్వాసములమునులు

'శ్రీనివాసుల వనసీమ వేఁటాడఁ
బూను వృషాసురుఁబొలి యించుటెట్టుల
అలపద్మినీ కాంత నంది పెండ్లాడఁ
గలుగుటెబ్బంగి యీ కలియుగాగమము
నందెట్లు విహరింతు నంతయు మాకుఁ
బొందుగాఁ దెలుపవే పుణ్యాచరిత్ర' తు 250

యని ప్రశ్నింపఁగా సూతుఁడు పురాణములుదడవి యావృత్తాంతములను వివరించుట గలదు. ఈ యాశ్వాసములందలి కథలు భవిష్యోత్తర పురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యమునఁ గానవచ్చుచున్నవి.

# శ్రీ వేంకటేశ్వర స్తవము

కవిరాజ, సాహిత్య విశారద, శ్రీ ఉప్పాడ రాజారావుగారు, బి. ఏ.

## షట్పదులు

శ్రీనివాసా! వరదాన దక్షా! జనశ్రేణిరక్షా! చిన్మయ స్వరూప!
పశానివంద్యా! మహేశానవేద్యా! సురమాననీయా! వేంకటేశ! జయతి 1
లోకబంధూ! జగదేకగురూ! వసుధైక కుటుంబీ! పురాణపురుష! పాశ
శాసనముఖ్య లోకేశ్వరాశ్రయా! ప్రకటయశ! వేంకటేశ! జయతి 2
పరమపావన! కృపాకర! జగద్దోష సంహార! శుభంకర! సదానాథనాథ!
సరసిజాక్షా! దివ్య సురుచిరాంగా! సురేశ్వరసమర్చ్యా! వేంకటేశ! జయతి 3

## విజయభద్రము

తిరుమలనివాస! జగతీ వల్లభా! హరీ !
దీన మందారమా! దివిజ సంగరభీమ!
పరమేశ్వరా ! కృపాపరిపూర్ణ ! పాహిమాం !
పరిశుద్ధ చరిత! నిర్భరభక్తి దేహిమే! 4

## విజయమంగళము

దీనబాంధవా! ముకుంద! దివ్య మంగళ స్వరూప!
దానవారి! వేంకటేశ! తత్త్వ చిన్మయ ప్రకాశ!
మానసంబు త్వత్పదాబ్జ మధుపరాజముగుచుఁ జొక్కఁ
గా ననుగ్రహించి నన్నుఁ గావుమెపుడు దేవదేవ ! 5

## ఉత్కళిక

ప్రేమధునీ! క్షేమఖనీ! స్వామిరా! నను నెనరుఁ బూని
సామజమును బ్రోచులీల లేము లెడపి సాకవేల ?
శ్యామల కోమలదేహా! రామా హృదయోత్సాహా!
కామితదాయక! తిరుమలధామా! వేంకటనాయక! 6

## భుజంగప్రయాతము

..మశ్శేష శైలేశ! నాకేశవంద్యా! రమాధీశ! గోవింద! రక్షోవిదారి !
సమస్తాఘసంహార! సత్యప్రచారా! ప్రమోదప్రదా! సర్వ భద్ర
ప్రదాతా! 7

# తిక్కన—ధర్మాద్వైతము

డా॥ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. (ఆనర్సు) Phd.

నన్నయ వ్యాసభారతము ననువదించుచుఁ దానూహించిన యానఁహిత విశ్వజనీనమైనదివ్యమూర్తిని 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని' ఇత్యాదిగాఁగల సీసపద్యమున వర్ణించియుండెను. అందలి గీతపద్యమున నతఁడు "వేదవ్యాసుఁడాదిముని, పరాశరాత్మజుండు, విష్ణుసన్నిభుండు, విశ్వజనీనమై పరగుచుండఁజేసె భారతంబు" నని పైయుల్లేఖనమును వ్యాసరచిత సంస్కృతభారతమునకు సంబంధించినదని స్పష్టముగాఁ జెప్పియుండెను. కాని పలువురా గుణవిశేషములన్నియు నన్నయ భారతరచనమునకును, గవిత్రియమువారి భారతరచనమునకును సమన్వయముచేసి చెప్పుచుందురు. అట్లు చేయుటలో దోషము లేదు. ఏలయన వ్యాస కవిత్రయభారతములు మాతాపుత్రికలు; వానిలో నన్యోన్యగుణసంక్రమణము గోచరించుటలో వింతలేదు. కాని నిజమునకు నన్నయకావించిన వర్ణనమునూత్రము మాతృకను సంబంధించినదే.

తిక్కనయు విరాటపర్వారంభమున 'విద్వన్ముఖ్యుః' డిత్యాదిగాఁగల పద్యారంభమున వ్యాసభారతప్రశంస కావించెను. 'కృష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబూని కావించె ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయము' నని సంస్కృత భారతముమగూర్చి యాతనియభిప్రాయము. అందు ధర్మాద్వైతస్థితి, లేఖ్యంబైనయామ్నాయము, అను పదములు ముఖ్యములైనవి. లేఖ్యమైన యామ్నాయమన వ్రాయఁదగిన వేదమనియర్థము. ఋగ్వాదివేదములకును బంచమమైనయీభారతవేదమునకును గొంచెము భేదమున్నది. అవి శ్రుతులు. వానిని వ్రాయుటగాని చదువుటకాని కొంతకాలము క్రిందటివఱకును నిషిద్ధములైన కార్యములు. తిక్కననాఁటికా నిషిద్ధ

ముండియుండవచ్చును. అందుచేసవి యలేఖ్యములు. పంచమవేదము తత్త్వమహత్త్వమువలన వానితోఁ దుల్యమైనదేయయ్యు లేఖన పఠన విషయమునఁ దద్భిన్నమైనది. ఇది లేఖ్యమైన యామ్నాయము.

ఇంక 'ధర్మాద్వైతస్థితి' యనునది యింతకంటెఁ గొంచెము క్లిష్టతరమైనది. అద్వైతపదమునకుఁ బెక్కర్థములున్నవి. సాధారణముగా నిది జీవబ్రహ్మైక్య పరముగా వాడఁబడుచుండును. Not dual; equable, unchanging, matchless; sole; unique అనునవి దానికి ఆప్టే నిఘంటువునఁ జెప్పఁబడిన యర్థములు. ధర్మములకు సమానభావము. లేక అభేదము, లేక ప్రాధాన్యముకలుగునట్లుగా వ్యాసుఁడు భారతము రచించెనని తిక్కన తలంచినట్లు భావింపవచ్చును. ధర్మముల కభేదమైన స్థితియనఁగా నేమో ముందు విచారింతము. ధర్మములన్నియు నభిన్నములుకావు. అవి వర్ణాశ్రమాచారములను లింగవయఃపరిస్థితులనుబట్టి పలువిధములుగానుండును. విప్రధర్మము వేఱు. క్షత్త్రియధర్మము వేఱు. ఇట్లు ధర్మములు భిన్నములయ్యును వానికొక విధమైన సమానత్వములేక అభేదము లేకపోలేదు. అదిగౌరవమున. విప్రునకు విప్రధర్మమెంతో క్షత్త్రియునకు క్షత్త్రియధర్మమంతే. రెండును బవిత్రములు, అనుల్లంఘనీయములు. వ్యాసభారతము సర్వధర్మములకును సమానప్రతిపత్తియే చెప్పును. ధర్మములన్నియు విశ్వశ్రేయస్సంపాదకములే. వానిలో న్యూనాధిక్యములుపాటించుట యవివేకము. ఈవిధముగా ధర్మములవిషయమున భేదమునందే యభేదము గోచరించును.

వ్యాసుఁడు ధర్మప్రధానముగా భారతము రచించెనుట పై దానికంటెను ఎక్కువ సమంజసముగానుండును. కావ్యములలోఁ బలు భేదములున్నట్లే వానియందలి ప్రాధాన్యమునందును, భేదము గోచరించును. అన్నికావ్యములును రసానందప్రయోజనకములే యైనను అవియొక్కొక్కటి యొక్కొక్క విషయమునకు బ్రాధాన్య మొసం

గుచుండును అందుఁ గొన్నిరసప్రధానములు; కొన్ని వర్ణనములు, కొన్ని ధర్మోపదేశప్రధానములు. ఇది ప్రాధాన్యవ్యపదేశముచేఁ జెప్పినమాట. వ్యాస భారతమున రసపోషణము వర్ణన బాహుళ్యముకూడ నుండి నను అది ధర్మప్రధానమైనరచన యనిచెప్పుటకు సందేహింపనక్కఱ లేదు. వ్యాసుఁడవకాశము చిక్కినపుడెల్ల నందు ధర్మనీతితత్త్వముల ప్రసక్తి తెచ్చుచునేయుండును. కథలద్వారా ఉపాఖ్యానములద్వారా ధర్మోపన్యాసములద్వారా అందతఁడు వివిధ ధర్మములను బోధించు చుండును. రసవర్ణాదులందాను షంగికములు. అందుచే వ్యాసుఁడు భారతమును ధర్మప్రాధాన్యము గలుగునట్లుగా రచించెననుట యుక్తి యుక్తముగా నుండును. తిక్కనయు నాభావముతోడనే యీపదముల నచ్చట వాడియుండును.

నన్నయ వ్యాసభారతమునకుఁ జెప్పినగుణవిశేషణముల నతని భారతమున నన్వయించునట్లే పలువురు తిక్కన వ్యాసభారతమును గూర్చి చెప్పిన ధర్మాద్వైతమనుమాట నాతని రచనయందే యన్వ యించుచుందురు. తిక్కన యెడనెడఁ గొన్నిమార్పులు గావించినను వ్యాసభారతమననుసరించి రచన సాగించినవాఁడేకాని కేవలస్వతంత్ర రచన గావించినవాఁడు గాఁడు, అందుచే సంస్కృతమున వ్యాసుఁడు చెప్పిన ధర్మమును, నీతిని, తత్త్వమునుఁ దిక్కనయుఁ జెప్పుచునేయుం డును. అయ్యును వారిరచనాదృష్టులలోఁ జాలభేదము గోచరించును. వ్యాసునిది పౌరాణిక నైతికదృష్టి; తిక్కనది కావ్యకళాదృష్టి. వ్యాసుఁడు తనరచనకుఁ బురాణమూర్తిని సృష్టింపఁ దిక్కనదానికిఁ గావ్యమూర్తిని గల్పించెను. వ్యాసుఁడు తనసృష్టిని సంహితగనో, పురాణముగనో, ఇతిహాసముగనో దర్శింపఁ దిక్కన దానిని ప్రబంధముగనో, కావ్య ముగనో దర్శించెను. స్పష్టముగాఁ జెప్పవలెనన్న వ్యాసుఁడు భారత మున ధర్మప్రవచనమునకుఁ బ్రాధాన్యమొసంగఁ దిక్కనరసపోషణ

మునకుఁ బ్రాధాన్యమొసంగెనని చెప్పవలెను. తిక్కన విరాటపర్వమునుగూర్చి హృదయాహ్లాది, ఊర్జితకథోపేతము, నానారసాభ్యుదయోల్లాసి యనిచెప్పుటయు శ్రీనాథుఁడతని రచనను రసాభ్యుదయబంధుమని వర్ణించుటయు నిందుకు నిదర్శనములు. అందుచే వ్యాసునివలెఁ దిక్కన భారతమును ధర్మాద్వైతస్థితి కలుగునట్లుగా రచింపలేదు. కాని యప్పటి సాంఘికసారస్వతాది పరిస్థితులనుబట్టి యాతని రచనయందును ధర్మాద్వైతస్థితి కన్పట్టుచున్నదని చెప్పవచ్చును. అది వ్యాసభారతమందలి ధర్మాద్వైతస్థితికంటె భిన్నమైనది.

తిక్కన తాన రచించిన భారతభాగమును హరిహరనాథదేవుని కంకితము గావించెను. అతఁడట్లు చేయుటకప్పటి మతసాంఘిక పరిస్థితులును, అందలి వైరుధ్యమునడంచి లోకసంగ్రహము గావింపవలెనను తిక్కన యభిలాషయుఁ గారణములు. నన్నయయనంతరము కర్ణాటదేశమున బసవేశ్వరోపజ్ఞమై వెలసిన శైవమతము క్రమముగా నాంధ్రదేశమునఁగూడ వ్యాపించెను. అది భక్తిప్రధానమై యనుయాయులకు మోక్షము సులభసాధ్యముగా గోచరింపఁజేయునట్టిమతము. అందుచే నది యచిరకాలముననే పలువురుజనుల మనస్సుల నాకర్షించెను. పామరులేకాక పండితులుకూడ నామతసిద్ధాంతములకలరి దానినవలంబించి ప్రచారముచేయఁదొడఁగిరి. పండితారాధ్య సోమనాథాది పండితకవులు శైవమత ప్రతిపాదకములు, శివసామరస్యసూచకములునైన గ్రంథములు వ్రాయుట యిందుకు నిదర్శనము. ఇట్లు కవులును బండితులునుజేసిన బహుళప్రచారమువలన నామతము పలుతావుల వ్యాపించెను. వేదప్రామాణ్యము నంగీకరింపనిదియు నావేశపూరితమైనదియు నగు వీరశైవ మొకవంక వ్యాపించుచుండ రామానుజప్రతిపాదితమైన వైష్ణవమతముకూడ దేశమునఁ బ్రచారము గాంచుచుండెను. తిక్కనతాతయైన భాస్కరుఁడు రామాయణము రచించెననియు దానిని

బూరించుటకై తిక్కన యుత్తరరామాయణము రచించెననియుఁ బ్రతీతి భాస్కరమంత్రి కృతమైన రామాయణమిప్పుడు లభించుటలేదు. అతఁడు దానిని రచించినమాట సత్యమేయైనచో నారచనకు వైష్ణవ మతప్రచారమే ప్రయోజనమైయుండునని చెప్పవచ్చును. ఆమాట యటుండ సర్వసుబోధమైన ద్విపదచ్ఛందమునందే తరువాత రంగనాథ రామాయణము వెలయుట బసవపురాణాదులగు శైవమత ప్రతిపాదకగ్రంథములకుఁ బ్రతియోగము కల్పించుటకేయైయుండును. ఈవిధముగా దేశమున హిందువులందే శైవవైష్ణవ విభేదము చెలరేగుచుండుటచేతనే యద్వైతసిద్ధాంత ప్రచారకమై, నన్నయచే నారంభింపఁబడిన భారతానువాదము వెంటనే పూర్తియగుటకవకాశము లేకపోయెను. సుమారు రెండుశతాబ్దులయనంతరము తిక్కన దానిని చేపట్టువఱకును అది యట్లే యుండిపోవుట కాంధ్రమునఁ బ్రతిభావంతులైన కవులును, పండితులును లేకుండుట కారణముకాదు. ఉన్నను వారిమనఃప్రవృత్తులు శైవవైష్ణవ మతసిద్ధాంతములలో నొకదానియెడ నున్ముఖములైయుండుటయే కారణము.

ధర్మమనఁగా మతము, నీతి, సంప్రదాయము మున్నగు నర్థములెన్నో కలవు. క్రీ. శ. 12, 13 శతాబ్దులం దాంధ్రదేశమునందలి ధర్మపరిస్థితులు ద్వైధీభావముతోఁ గూడి మిక్కిలి విషమములై యుండెను. శైవులు, వైష్ణవులను, వైష్ణవులు శైవులను ద్వేషించుచు సామరస్యము లేకయుండిరి. 'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే' యను భావమున కించుకయుఁ దావు లేకుండెను, శైవులు మఱియు విరుద్ధముగా వర్తించుచుండిరి. వారు శైవుల దర్శన, స్పర్శన భాషణాదులను గూడఁ బరిహరించుచు ససహనమున కాటపట్టులై వర్తించుచుండిరి. అట్టి సమయమునఁ గారణజన్ముఁడైనయవతారమూర్తివలెఁ దిక్కన జన్మించెను. అతఁడు దేశమునందలి మతసాంఘికపరిస్థితులు పరికించి విషమ

ములైన వానికి సామరస్యము కల్పించుటకై పలువిధముల నాలోకించు చుండెను. నన్నయ యారంభించిన భారతానువాదమును జేపట్టి హరిహరోభయాత్మకుడైన దివ్యమూర్తికి దానినంకితముచేయుట యా సామరస్యమునకై యాతఁడొనరించిన ప్రయత్నములలో నొక్కటి. తిక్కనకు సంబంధించిన ధర్మాద్వైతవిధానమున శైవవైష్ణవమత సామరస్యసాధనమైన భారతము రచించుటయు దానిని హరిహరనాథ దేవునకంకితము చేయుటయు ముఖ్యములైన యంగములు.

తిక్కన భారత రచనద్వారా కవితా విషయమునఁ గూడ నొక విధముగా నద్వైతము సంఘటింప యత్నించి కృతకృత్యుఁడయ్యె నని చెప్పవచ్చును. నన్నయ గాదికవియను బిరుదమున్నను అతనికిఁ బూర్వమాంధ్రమున నసలు కవిత్వము లేకపోలేదు. అభంగురములైన శిలాతామ్రఫలకములందప్పుడు రచింపఁబడిన పద్యములు గోచరించు చుండఁగాఁ గవిత్వము లేదని చెప్పుట యెట్లు పొసఁగును? కాని యా రచనయంతయు దేశిమార్గమునకుఁ జెందినట్టిదే. మార్గకవితా పద్ధతి నవలంబించి యుదాత్తవస్తుకమైన మహాకావ్యమును రచింప నారంభము చేసినవాఁడు నన్నయయే. అతఁడాదికవియనుట యొదలి యర్థముకూడ నదియే. దేశిమార్గము కామచారప్రవృత్తి కలది. దేశకాలములఁబట్టి మాఱుచు నది స్థిరత్వములేక యుండును. అందు సంస్కృతపదలక్షణానుసరణము సాధ్యమైనంత స్వల్పముగానుండును. మార్గపద్ధతి ప్రతిష్ఠించి తరువాతి వారికి దాని నాదర్శముగావించెను. శైవకవులు మాత్రము దాని నొజ్జబంతిగాఁ గైకొనక నన్నయకుఁ బూర్వముండిన దేశిమార్గమునే కొనసాగించిరి. వారు సాధ్యమైనంతవఱకు సంస్కృతసమాసములు, పరిహరించి జాను తెనుఁగు వాడుచు దమ రచనలను సర్వజనసుబోధములు గావించుటకై యత్నించిరి. ఈ విధముగాఁ దిక్కననాఁటి కాంధ్రకవితారంగమునఁ గూడ మార్గదేశి

విధానాశ్రయమైన ద్వైవిధీభావము చెలరేఁగుచుండెను. తిక్కన మతరంగమునవలె గవితారంగమునఁ గూడ నా ద్వైవిధ్యమును దొలఁగించి సామరస్యము కలిగించుటకు యత్నించెను.

తిక్కన విరాటపర్వారంభమందలి యవతారికలో "కావున భారతామృతము కర్ణపుటంబున నారఁగ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ" భారతమును రచింతునని చెప్పియుండెను. ఆంధ్రావళిలోఁ బండితులును పామరులును గూడ నుందురు. తన రచనయొక్క పండితులకే కాక సర్వాంధ్రజనసంతతికిని మోదము కూర్పవలెనని యాతని యభీష్టము. దానిని సాధించుటకై యాతఁడు సాధ్యమైనంతవఱకలంతి యలంతి తెలుఁగు పదములనే తన రచనమున వాడుటకు యత్నించెను. రసానుగుణముగా నాతఁడు ప్రౌఢదీర్ఘములైన సమాసముల గుప్పించిన సన్నివేశములు లేకపోలేదు. కాని యాతని సాధారణ ప్రవృత్తి తెలుఁగుఁదనమువైపుననే మొగసూపుచుండును. ఇట్లని యాతఁడు శైవకవులవలె వ్యాకరణాదులయెడ వైముఖ్యము ప్రదర్శించినవాఁడు కాఁడు. అతఁడు లక్షణానుసరణమున సంస్కృత సంప్రదాయమునే యనుసరించుచు భాషాప్రయోగ సందర్భమున దేశిమార్గము నవలంబించెను. నిజమునకు శైవకవుల రచనములందుకంటెను, తిక్కన రచనమందే దేశితన మెక్కువగాఁ గానిపించును. ఈవిధముగా నాతఁడు మార్గదేశిసంప్రదాయములు రెండింటికిని భారతము ద్వారా సామరస్యము చేకూర్పఁజాలెను. ఆతనికి సంబంధించిన ధర్మాద్వైత సంధానమున నిదికూడ నొకభాగము.

తిక్కన కుభయకవిమిత్రుఁడను బిరుదు కలదు. "నేనుభయకావ్యప్రౌఢి వర్తించు శిల్పమునం బారగుండ"నని నిర్వచనోత్తరరామాయణమున నాతఁడే చెప్పుకొనియుండెను. ఉభయకావ్యములన సంస్కృతాంధ్రకావ్యములని సాధారణమైన యర్థము. కాని నిర్వ

చనోత్తర రామాయణారంభమునందలి సంస్కృత శ్లోకమును, "శ్రీమన్మ్రే మాలా" మిత్యాది హరిహరనాథోద్దిష్టమైన శ్లోకమును దప్ప నాతఁడు రచించిన సంస్కృతరచనలేవియుఁ గన్పడవు. ఒకవేళ అతఁడు సంస్కృతమునఁగూడ నేవైనఁ గావ్యములు రచించెనేమో మనకుఁ దెలియదు. గంగాదేవి మధురావిజయ కావ్యమునఁ బూర్వకవిస్తుతిలోఁ దిక్కన పేరుకూడ నుటంకించెనఁట. ఆమె తెలుఁగుదేశమునందలి కవిగా నాతనిఁ బేర్కొనెనో సంస్కృతకవిగా నతని స్మరించెనో తెలిసికొనుట కాధారములు లేవు. అయ్యును దిక్కన యుభయకవి మిత్త్రత్వము సంస్కృతాంధ్రములకు సంబంధించినదే యని చెప్పుట సంప్రదాయము. కాని యాతఁడు భారతమున సంఘటించిన మార్గ దేశికవితా సామరస్యమును దృష్టియందిడుకొని చూచినచో నతఁడు మార్గకవులకును దేశికవులకునుగూడ భారతరచనచే మిత్త్రుఁడయ్యెనని చెప్పవచ్చును.

తిక్కన భారతవచనమున నాంతరముగాఁ గల్పించిన ధర్మాద్వైతమును గొంతకలదు. అందుఁ జాలభాగము వ్యాసోపజ్ఞకమైనట్టిదే. భారతమునఁ బెక్కుచోట్ల హింసాహింసలు, సత్యాసత్యములు మున్నగు విరుద్ధధర్మముల స్వరూపము వివరింపఁబడినది. చీఁకటివెలుఁగులకు వలె వానికి సామరస్యము కల్పించుట యసంభవము. కాని కొన్నిచోట్ల ధర్మాధర్మ తత్త్వ నిరూపణ మతిసూక్ష్మమై బహుగహనముగా నుండును. కొన్ని పరిస్థితులలో హింసయే యహింసయగును. అసత్యమే సత్యమగును. "భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యము" ఇత్యాది పద్యములను బరికించినచో నీవిషయము తేటతెల్లమగును. ఇట్టి ధర్మసూక్ష్మములను వివరించు నుపాఖ్యానములు శాంత్యనుశాసనపర్వములలోఁ గొన్ని కలవు. అవి సామాన్యదృష్టికి విరుద్ధములుగాఁ దోఁచు ధర్మములకు సామరస్యమో అభేదమో కల్పించును. ఇట్టి కథలను నిపుణముగా రచించినవాఁడగుటచేఁ గూడఁ దిక్కన విషయమున ధర్మాద్వైతమనునది సార్థకమగుచున్నది.

తిక్కన జీవితమునందుఁగూడ ధర్మాద్వైతస్థితి కానిపించును. వైదికలౌకికములు రెండింట నాటి తేజియుండుట, కొట్టరువు వంశీయుల విశిష్టత. వారు లౌకికకార్యములం దెంతప్రజ్ఞాశాలులో వైదికకర్మకలాపములందంత నిష్ఠ గలవారు. ఈసనున్వయము తిక్కనయందుఁ బరాకాష్ఠ పొందించినది. అతఁడు వైదికమార్గ నిష్ఠమగు వర్తనమును నిర్వహించుచునే మనుమసిద్ధి నృపాలుని యాస్థానమున మంత్రిత్వమును నెఱపుచుండెను. అతఁడు భారతరచన చేయుటకుముందు యజ్ఞము నాచరించిసోమయాజియయ్యెను. అంతకుముందుకాక తీయచక్రవర్తియైన గణపతిదేవునికడకు రాయబారిగానేఁగి రాజ్యభ్రష్టుఁడుకానున్న తన ప్రభువునకు మరల రాజ్యప్రాప్తి కలిగించెను. అతని గృహమొకవంక వేదవిద్వాంసులతోడను వేఱొకవంక లౌకికకార్య ధురంధరులతోడను గిక్కిఱిసి యుండెను. ఈవిధముగా నామహనీయుఁడు వైదికలౌకిక జీవితవిధానములకుఁగూడలియై తనవర్తనమున ధర్మాద్వైతస్థితిని సంఘటించెను.

కవిత్వము సంధ్యానందనమునకు బావగారని (శ్రీ) తిరుపతివేంకటేశ్వరుల వర్ణనము. కవితాప్రియులు కర్మఠులైయుండుట యెచ్చటనో కాని సమకూడదు. తిక్కనసోమయాజి యెంతకవితా ప్రియుండావుఁడో యంత కర్మనిష్ఠుఁడు. పరస్పర విరుద్ధములైన యాగుణములు పూర్వులలో నన్నయ తిక్కనాదులందును, ఆధునికులలోఁ గవిసార్వభౌమాదులయందును సామరస్య సిద్ధిగాంచినవి. ఈవిధముగాఁ దిక్కన ధర్మాద్వైతస్థితి కవలంబియైన మహాభారతము నతిసమర్థతతో ననువదించుటయేకాక మత,కవితాజీవితాదులగు పలురంగములందుఁగూడ నట్టిస్థితిని సాధించి పూర్ణజీవితము పుచ్చి యాంధ్రుల కారాధ్యుడైన యెనాఁడు.

# రామాయణము—తెలుఁగు మెఱుఁగులు.

శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి, ఎం. ఏ.

రామాయణము, భారతము, భాగవతము ననునవి భారతీయ భాషావాఙ్మయ ప్రపంచమును తీర్చిదిద్దుచున్న త్రిమూర్తులనవచ్చును. అందును నాంధ్రసాహిత్యముపై నసామాన్య ప్రభావమును బఱపిన వానిలో రామాయణ మగ్రగణ్యము. రామాయణపిపాస మన కెన్ని రామాయణములు వచ్చినను తగ్గలేదు. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము, భాస్కరరామాయణము, రంగనాథ రామాయణము, మొల్ల రామాయణము, రఘునాథరామాయణము, వరదరాజు రామాయణము, గోపీనాథరామాయణము, ఆంధ్రవాల్మీకి రామాయణము, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీకృష్ణరామాయణము, విశ్వనాథ రామాయణ కల్పవృక్షము... మొదలగున వెన్నో వెలసినవి, వెలయుచున్నవి. వెలయనున్నవి. "శ్రేయసి కేన తృప్యతే".

ఇంతటితో రామాయణము శిష్టలోకములో మడికట్టుకొని కూర్చుండలేదు. ఆబాలగోపాల మందుబాటులో నుండునట్లు రామాయణములోని కొన్నికొన్ని రసవంతమైన సన్నివేశములు దైనందిన జీవితములో నైమిత్తిక, కామ్య కర్మకలాపములలో నుపయోగింపఁ బడుటకయి హరికథలు, బుఱ్ఱకథలు, స్త్రీలపాటలు, ఏలపాటలు మున్నగు పెక్కువిధములు రూపొందింపఁ బడినవి.

కౌసల్యాబైకలు. సీతమ్మసమర్త, లక్ష్మణదేవరనవ్వు. ఊర్మిళాదేవినిద్ర, లంకాయాగము, కుశలవ కుచ్చలచరిత్ర, మంగళహారతి పాటలు, మొదలగు జానపదవాఙ్మయ మధికముగా నున్నది. (వీనిని గూర్చి డాక్టరు బి. రామరాజుగారి తెలుఁగు జానపద వాఙ్మయచరిత్రలో విపులముగా వివరింపఁబడినది.) త్యాగరాజుకృతులు, భద్రాద్రి రామదాసుకీర్తనలు తెలుఁగు సాహిత్యమున మఱవరానివి. రామాయ

ణమునుండి స్ఫూర్తిఁగొని జనించిన శతకములు, నాటకములు, దండక ములు, మొదలగునవి లెక్కకు మిక్కిలిగా నున్నవి.

సారస్వతములోనే కాకుండఁ దెలుఁగుభాషలోఁ గూడ రామాయణము జీర్ణించిపోయినది. రామాయణము నాధారముగాఁగొన్ని జాతీయములు, పలుకుబడులు, సామెతలు భాషలోఁ బెక్కు కనిపించును.

## సామెతలు

1. "రామాయణ మంతా విని రాముఁడికి సీత ఏమౌతుంది" అన్నట్లు ప్రాథమికవిషయమును గూడ గ్రహింపలేక పోయినప్పుడీనిని వాడుదురు.

2. రామాయణములో పిడకలవేట (పిడకలాట, పిడకలేయటం అని రూపాంతరములు.)

సంబంధములేనివానిని మధ్యలోఁ బ్రవేశపెట్టుట — ఒకదానికేదైన నవాంతరము వచ్చుట జరిగినప్పుడిది యందురు.

పిటకములనునవి బౌద్ధుల పవిత్ర గ్రంథములు. ఆంధ్రదేశమున నొకప్పుడు బౌద్ధమత మెక్కువ ప్రచారములో నుండెడిది. పిడకలను నది పిటకములకు వికృతికావచ్చును పిటకములందనేక కథలు ప్రత్యేక ధర్మమునో, నీతినో బోధించుటకై వచ్చును. కావుననే యట్టికథలనే గాక యేచిన్నకథనైన (పిటకకథలు) "పిట్టకథ"లనుట వాడుకయైనది.

రామాయణములో నట్టి 'పిడకల'ను వెదకుటగాని, ప్రవేశపెట్టుటగాని యసంబద్ధములు నసంగతములు నని భావము. రామాయణము పురాణపఠనము జరుగుచుండఁగాఁ దచ్ఛ్రవణమునకు భంగము కలుగు విధమున సమీపమున 'పిడకలు వేయుట' (పిడకలు కొట్టుట) నైయుండునని యొక యభిప్రాయము.

3. నాచిన్నిపొట్టకు శ్రీరామరక్ష — స్వార్థపరత్వము.

4. చదివేవి రామాయణ భారతాలు — పడద్రోసేవి దేవాలయములు.

మంచివి చదువుచు నందలి విషయముల ననుసరింపక చెడు చేయుచుండుట.

5. చావుతప్పి కన్ను లొట్ట పోయింది.

కొంతనష్టముతోఁ బెద్దనష్టమును దప్పుకొనుట. శ్రీరాముఁడు సీతాదేవిని బాధించిన కాకాసురునిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. ఆయస్త్రమునుండి యతనిని రక్షించువాఁడు ముజ్జగములం దెవ్వరును లేకపోయిరి. తుదకు శ్రీరామునే 'శరణు' వేఁడి యమోఘమైన యా బ్రహ్మాస్త్రమునకు బలిగాఁ దనకంటినొసఁగి చావు తప్పించుకొనెను ఈయుపాఖ్యానము నీసామెత తెలుపును.

6. పదింట్లో పదకొండు :—సాధింప వలసినవనేక మున్నపుడు వానికొకటి యదనముగాఁ జేరుట యుపేక్ష్యమనిభావము.

విభీషణ శరణాగతి ఘట్టమయిన పిమ్మట నొకవానరుఁడు రామునిఁజేరి 'స్వామీ! ఒకవేళ విభీషణుఁడు మనకు ద్రోహముచేసి తన యన్నతోఁ జేరిన నేమగునని యడిగెను. దానికి రాముఁడు పదింట్లో పదకొండ'ని సమాధాన మిచ్చెనఁట. అనఁగాఁ దునుమవలసిన రావణాసురుని పదితలలతోపాటు విభీషణునితల పదునొకండవదగును. దానికంత యాలోచింపవలసినదిలేదని యర్థము.

7. ఇంటిగుట్టు లంకకుచేటు—

ఇంటిగుట్టితరులకుఁ దెలియుటవలననే లంకంతసామ్రాజ్యమ స్తమించినది. అస్త్రహతుఁడై మరణశయ్యపైఁ గొనయూపిరితో నున్న రావణునియొద్ద రాజనీతిని నేర్వుమని శ్రీరాముఁడు లక్ష్మణునితో ననెనఁట. అంతనతఁడు రాజనీతి విశారదుఁడగు రావణబ్రహ్మను వేఁడగా "ఇంటిగుట్టు లంకకు చేటు" అని మితముగా బోధించెనఁట.

8. అంపశోకమెత్తు - అగస్త్యుఁడొకమెత్తు !

ఈసామెతకూడ రామాయణముపై నాధారపడినదనవచ్చును. అగస్త్యుని వృత్తాంతము విపులముగా రామాయణమునందు వచ్చును గనుక నీసామెత నిట నుటంకించితిని. అగస్త్యుఁ డందఱవంటివాఁడు కాఁడు. మహాప్రభావ సంయుతుఁడని యిది చెప్పుచున్నది.

పార్వతీపరమేశ్వరుల వివాహమప్పుడు దేవతలందఱు నుత్తర దిక్కునఁ జేరుటచే భూమి యుత్తరమున కొఱగుచుండఁ బరమేశ్వరుఁడు తన్నివారణార్థ మగస్త్యుని దక్షిణదిక్కునకుఁ బంపెననియు నప్పుడు భూమిసమానముగా నుండెననియు నొకకథ చెప్పుదురు.

9. రాముఁడిరాజ్యము — భరతుఁడిపట్టము.

పేరొకరిది యనుభవమింకొకరిదియు నయినప్పుడిది వాడఁబడును. పిల్లలదుపులేక యున్నపుడు వారినుద్దేశించి యిదివాడుటకలదు.

10. హనుమంతునిముందు కుప్పిగంతులా ?

సమర్థుడైన గొప్పయనుభవశాలిముందు చూపు నల్పప్రజ్ఞలు

11. నవ్వు నాలుగందాల చేటు (నాలుగు విధాలచేటు)

రామపట్టాభిషేకము జరుగుచుండగా నిన్నిసంవత్సరములనుండి నిద్రలేని లక్ష్మణునికొక కునుకువచ్చినది. దానికతఁడు తనలో నవ్వుకొనినాఁడు.అదిచూచిరాముఁడు,సీత,విభీషణుఁడు,సుగ్రీవుఁడు మొదలగు వారు పరిపరివిధముల ననుకొనిరి. ఈముచ్చటైన కథను దీసికొని 'లక్ష్మణదేవర నవ్వు' జానపద కావ్యము చక్కగా రచింపఁబడినది.

12. 'జీర్ణం - జీర్ణం - వాతాపి జీర్ణం -'

తిన్నదెట్టిదయినను జీర్ణమగునని భావము. తల్లులు పిల్లలకుగ్గు బెట్టునపుడు దీనినందురు. అగస్త్యుఁడు వాతాపి రక్కసుని జీర్ణమొనరించుకొనినటులు నీవుదీనిని జీర్ణమొనర్చు కొందువుగాక యని యాశంసనము. ఆహారపరిణామార్థ మగస్త్యుని స్మరింపవలెనని పెద్దల

యనుశాసనము.

13. 'కట్టె - కొట్టె - తెచ్చె -'

దీనినే 'సంగ్రహ రామాయణ' మందురు. సుదీర్ఘమయిన దానిని మూఁడుముక్కలలోఁ దేల్చి చెప్పుట యనిభావము. రాముఁడు వారిధి 'కట్టె'ను. రావణుని 'కొట్టెను' సీతను 'తెచ్చెను'.

14. రామాయణము అంకు — భారతము బొంకు.

చులకనగాఁ దేల్చివేయునపు డందురు. సీత యొక్క పాతివ్రత్యముపై నాధారపడిన కథగనుకఁ గొందఱట్లందురు.

15. లంకను బుట్టినవన్నీ రాక్షసులే —

చెడు వాతావరణములోఁ బుట్టినవారెల్లరు సామాన్యముగా దుర్మార్గులే యని భావము.

16. రామాయ స్వస్తి. రావణాయ స్వస్తి.

వివాదములో రెండుపక్షములవారికిని సమయానుకూలముగా మేలుపలుకువారి నిట్లందురు.

రామరావణులకు ద్వంద్వయుద్ధము జరుగుచున్నది. దేవతలు, ఋషులు నెల్లరు నాకసమునుండి చూచుచుండిరి. అందుఁ గొందఱు రామునిది పైచేయిగా నున్నపుడు "రావణునిపీడ విరుగడయైనది. రాముఁడు సామాన్యుఁడా? అవతార పురుషుఁడు. 'రామాయ స్వస్తి' యనిరి. అంతలో రావణునిది పైచేయికాఁగా రావణుఁడే గెలుచునేమో ? అతఁడు గెలిచిన నతని దయాధర్మములపై మ్రనవలసిన వారమని భయంపడి "రావణుఁడన సామాన్యుఁడా ? మహాపరాక్రమవంతుఁడు. త్రిలోకవిజేత. పులస్త్యబ్రహ్మ వంశమున జనించిన వాఁడు. రావణాయ స్వస్తి' యని పొగడిరి. ఇట్లు స్థిరత్వము లేక 'దొర్లుడు పుచ్చకాయ' వలెఁ బ్రవర్తించుటను బైసామెతతో సూచింతురు.

17. 'చూచిరమ్మంటే కాల్చివచ్చినట్లు' (కాల్చివస్తాఁడు.)

చెప్పినదానికంటె నధికముగా సాధించుకొనివచ్చునని భావము. సీతనుజూచిరమ్మని హనుమంతుని బంపఁగా నతఁడు రావణుని సైన్యమును గొంతహతముచేసి యక్షయకుమారుని జంపి లంకాపురమును గూడ దహనముచేసి వచ్చెనుగదా!

18. కాలం కలిసొస్తే గుండ్లు తేలుతవి.

రాముఁడు వారధి కట్టునపుడు కాలము దైవము ననుకూలించుటవలన గుండులు బెండులవలె సముద్రముపైఁ దేలినవి.

## పదబంధములు

1. సుగ్రీవాజ్ఞ— } తిరుగులేనివి.
2. రామబాణము }

3. త్రిశంకుస్వర్గము—ఎటుగానిది.

4. అగస్త్యభ్రాత— అప్రసిద్ధుఁడు. ఒక ప్రసిద్ధుని చాటునఁ జెప్పికొనఁబడు ననామకుఁడు.

5. రామరాజ్యము—సురాజ్యము

6. పరశురామప్రీతి—అగ్ని కాహుతి యగుట.

పరశురాముఁడు ముయ్యేడుమాఱులవనియెల్లఁదిరిగి క్షత్రియులను హతమొనర్చెనని యైతిహ్యము. శత్రువులపురములను దగులఁ బెట్టుట దండయాత్రలలో నాచారము. ముఖ్యముగానిది దక్షిణ హిందూదేశ చరిత్రలోఁ జదువనగును. పరశురాముఁడు దక్షిణదేశమున స్థిరనివాసిగా నున్నట్లు చెప్పుదురు.

పరశురాముఁ డతిరోషమున రాజులను సంహరించునపుడు వారిపురములను దగులఁబెట్టుటవలనఁ బైమాటకు లాక్షణికముగా నగ్ని కాహుతియగుట యనునర్థము దక్షిణదేశమునఁ బ్రచారమయి యుండును. ఈజాతీయము పురాణములువదలిన యంశమును దెలుపు

చున్నదనవచ్చును.

7. మంథరబోధ—మంచియుద్దేశ్యముతో నున్నవారినిఁగూడఁ జెడువైపునకు మరలించు దుర్బోధలు.

8. కబంధహస్తాలు—పెద్దచేతులు. ఇతరులను భక్షించుటకుఁ జాచిన చేతులు. ఇటీవలనిది పత్రికలవారిచే నధికముగా వాడుకలోనికి తేఁబడినది.

9. కిష్కింధాపురాగ్రహారికులు—కోతిచేష్టలు చేయువారిని గూర్చి గంభీరముగా ననుమాట.

10. రామంధూళి— } ఎడతెఱపిలేనిది. రాములవారు దాడి
11. రామందాడి— } వెడలునప్పుడు లేచినధూళివలె, లేక దాడిలోఁ బాల్గొనిన వానర సైన్యమువలెఁ గొలఁది యిడరానిదని భావము. రావణ వధానంతరమువఱకుఁ గూడఁ గొంతవానరసేన వారిధిని దాటుచునేయుండెనని రామాయణము

12. సీతమ్మవారి చెఱలు—మిక్కిలి కష్టములు. వినువారికిఁ గూడ దుఃఖమును దెప్పించుకష్టములు.

13. ఉడుతాభక్తి—శక్తికొలఁది భక్తితోఁ జేయుసాయము. శ్రీరాముఁడు వారిధికట్టునపు డుడుతయొకటి యిసుకలోఁ బొరలి తన మేనికంటిన యిసుకరేణువులను వారిధిపైఁ దులుపుచుండెననియు దానికి రాముఁడునంతసించి దానిని దనచేతితో నిమిరెననియుఁ దత్సూచకముగ నుడుత యొడలిపై నిప్పటికిని నిలువుగా మూఁడు గీతలు రాముని యంగుళీచిహ్నములుగ నిలిచెననియుఁ గత.

14. అన్నమో రామచంద్రా యనుట—పట్టెఁడన్నమునకై కటకటపడుట; బిచ్చమెత్తుకొనుట.

15. అలోలక్ష్మణా యని యేడ్చుట—ప్రక్కవారితోఁ జెప్పుకొని పలవించుట. రాముఁడు సీతకొఱకు శోకించునట్లు దుఃఖించుట.

16. చుప్పనాతి—ముచ్చి యోర్వ లేనిది, చుప్పనాతి. చుప్ప నాక —శూర్పణఖా శబ్దవభవములు.

17. శ్రీరామ చుట్టుట—ప్రారంభించుట. శ్రీరాముఁడు తెలుఁగు వారి యిలువేలుపు. తెలుఁగు దేశమున నేమైన వ్రాయునపుడు తొలుత 'శ్రీరామ' చుట్టుట సంప్రదాయము.

18 రామా రామా అనఁగూడదు-పాపమని తలచఁగూడదు. ఎంత కష్టపడుచున్నను సానుభూతి చూపఁగూడదని భావము.

(వానిని ముక్కలుగా నఱికినా రామ రామా అనఁగూడదు-ఇత్యాదిగా వ్యవహారము.)

19. వాలిసుగ్రీవులు—విడఁదీయ లేని పోలికలుగల యిద్దఱు వ్యక్తులు.

20. రామలక్ష్మణులు—అన్యోన్యత కలవారు.

21. రావణాసురుఁడి కాష్ఠం—ఎప్పటికి నాఱిపోవనిది. మండోదరి పతివ్రతగనుక నామెయెప్పటికి ముత్తైదువుగా నుండునట్లు వరముండుటవలన రావణాసురుని కాష్ఠము (చితి) యాఱిపోకుండ పొగ రాజుచునే యుండునని చెప్పుదురు. ఎప్పటికిఁ దెగని సమస్యను దీనితోఁ బోల్తురు.

22. లంకంత యిల్లు—పెద్దయిల్లు.

లంకంతయిల్లు - కంచంత కాఁపురమునని వాడుక.

23. కుంభకర్ణుఁడినిద్ర—మొద్దునిద్దుర.

24. దేవాంతకుడు } మాయావులగు రాక్షసరాజకుమారులు.
25. కాలాంతకుడు } సామాన్యులు కారను అర్థమున దీనిని వాడుదురు.

26. కాలనేమి—పనులు చెడఁగొట్టుటకుమధ్యనడ్డపడు మోసగాఁడనుటకు దీనినివాడుదురు. 'వాఁడుకాలనేమి రా!' అనివ్యవహారము.

హనుమంతుఁడు సంజీవిని దెచ్చుటకుఁ బోవునప్పుడు మునివేషమున మోసగింపఁ బ్రయత్నించిన రాక్షసుని పేరు కాలనేమి.

27. రావణ శంబర మాయలు—చెడు పన్నాగములు.

28. భగీరథ ప్రయత్నము—ఫలితము సాధించువఱకుఁ బట్టుదలతోఁ జేయుప్రయత్నము. భగీరథుఁడు గంగను దివినుండి భువికి నవతరింపఁ జేసెనుగదా!

29. బ్రహ్మదేవుని చెంబటికి—సరియగు సమయము మించి పోవువఱకుఁ జేయు జాగని యర్థము.

రావణుఁడు జన్మించినపుడు నామకరణము చేయుటకై బ్రహ్మను రమ్మనిరఁట. ఆయన శౌచము నిర్వహించుకొని యిప్పుడే వత్తునని గురుశంక కేఁగెనఁట. ఆయన తిరిగివచ్చి పిల్లవానిని జెంతు. నామకరణమొనర్తుననఁగనే యచ్చటివారు— తద్బాలకుఁడు రావణుఁ డను పేర విఖ్యాతుఁడై ముల్లోకములను గడగడలాడించి, పెక్కు వేల సంవత్సరముల పిమ్మట రామునిచే సంహరింపఁబడుట యెఱిఁగించిరఁట.

బ్రహ్మ కాలమాన ప్రకార మత్యల్పసమయమే, మానవ కాలమానము ప్రకారమనేక సహస్ర సంవత్సరములకు సమానమను రహస్యము నిది కథాముఖమునఁ దెలుపుచున్న దనుకొందును. వేయి చతుర్యుగములనఁగా నాలుగువందల ముప్పదిరెండుకోట్ల మానవ సంవత్సరములు బ్రహ్మకొక పగలుగాని రాత్రిగాని యగును.
దీనినే 'కల్ప' మందురు.

30. ఆకాశరామన్న— అజ్ఞాతవ్యక్తి. 'ఆకాశరామన్న' లేఖలు తెలిసినవే.

31. చతుర్ముఖ రామాయణము—చీట్లపేక యాడుట.

32. పాదుకా పట్టాభిషేకము—చెప్పుదెబ్బ తినుటకు హేళనగా నిటులందురు.

33. ఇక్ష్వాకుల నాటిది—అతి ప్రాచీనమైనదని యర్థము. "ఇక్ష్వాకూనా మయంభూమిః...అని రామాయణము

34. రామ రావణయుద్ధము—ఇరువురువ్యక్తులకు సమానము గాజరుగుచున్న పెద్దపోట్లాట.

35. జాంబవంతుఁడు—అనుభవ శాలియగు వృద్ధుని జాంబ వంతుఁడందురు.

36. సుగ్రీవబొబ్బ—పెద్ద కేక.

37. సీతారామకోఁట—అభివృద్ధిలో రమణీయముగానున్న దనుటకిది వాడుదురు. ఆతోఁట సీతారామకోఁరుచున్నదని వ్యవహారము.

38. రామదండు—రాములవారి సైన్యము. ఏదయిన పనిని సాధించుటకయి పోవుగుంపును 'రామదం'డందురు. ఆంధ్రరత్న దుగ్గి రాల గోపాలకృష్ణయ్యగారు తమ 'రామదండు'ల మూలమున నీమా టకధిక ప్రచారము కలిగించిరి.

39. 'రామచక్కని'—రామచక్కనిపిల్ల-యనిన నందమయిన ముద్దరాలని యర్థము. ఇచ్చట 'రామ' యను విశేషణము సౌంద ర్యాధిక్యమును దెలుపుచున్నది. అటులే 'రామచిలుక' యనినప్పుడు గూడ సుందరమయిన శుకమని కావచ్చును.

పైసామెతలు, జాతీయములు కేవలము 'వాల్మీకిరామాయ ణము' పైనేగాక యవాల్మీకీయములగు 'విచిత్ర రామాయణము, వాసిష్ఠ రామాయణము' మొదలగువానిపైఁ గూడ నాధారపడి బహుళ ప్రచారములోనికివచ్చి జాతిజీవితములోఁ జోటు చేసికొనినవి.

1. వీనిలోఁ గొన్ని రామాయణములోఁ బాత్రములవంటి గుణములు కలవారిని సూచించును. ఉదా: జాంబవంతుఁడు, దేవాం తకుఁడు.

2. మఱికొన్ని రామాయణములోని కథలు, సన్నివేశములు నాధారముగా నేర్పడినవి. ఉదా: ఉడుతాభక్తి, నవ్వునాలుగందాల చేటు

3. వేఱుకొన్ని తేలికయగునంశమును గోప్యముగను, గంభీరముగను సూచించుట కేర్పడినవి. ఉదా: కిష్కింధాపురాగ్రహారికులు.

సామెతలు, జాతీయముల రూపమున రామాయణము ప్రజా జీవితములోఁ బాతుకొనిపోయినది. అట్టివాని నెత్తిచూపుటకే యీ నా ప్రయత్నము. ఇతర భారతీయ భాషలలోఁ గూడ నిట్టియత్నము జరిగిన వాఙ్మయ విషయకముగనే కాక సాంస్కృతికముగఁ గూడ విలువ యుండఁగలదని నా నమ్మిక

## కవిత్రయానంతర భారతములు

శ్రీ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి, ఎం. ఏ.,

కవిత్రయమువారి తరువాత మహాభారతమును దిరిగి తెనుఁగున వ్రాయుటకుఁ జాలమంది యత్నించిరి వారిలోఁ గృతకృత్యులైన మహానుభావుఁడు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. అట్లు యత్నించిన వారిలోఁ గొందఱు వ్రాసినవి పూర్తిగా లభించుటలేదు. కొందఱసలు పూర్తిగా వ్రాసిరో లేదో కూడఁ దెలియవచ్చుట లేదు. అధర్వణుఁడు పూర్తిగా భారతమువ్రాసి యుండునని అనుకొనుటమాత్రమే గాని, యేవో కొన్ని పద్యములుతప్ప అసలు గ్రంథము లభించినది లేదు. క్రీ శ 1663-1712 ప్రాంతమున గద్వాల సంస్థానమునందున్న కొటికెలపూడి వీరరాఘవయ్య 'యథాశ్లోక తాత్పర్య భారతము' వ్రాయసమకట్టినట్లు ఉద్యోగపర్వమునఁ జెప్పుకొన్నాఁడు. ఆయు

ద్యోగ పర్వముతప్ప మఱియొకపర్వము నేటికీ లభించలేదు. భీష్మ ద్రోణ పర్వములలో నొకటి తాటియాకుల ప్రతి హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు గ్రంథాలయమునఁ గొంతమాత్రమున్న దనియు, అది వీరరాఘవయ్య వ్రాసినదే యయియుండు ననియు నీమధ్య గోలకొండపత్రికలో అస్మదాప్తమిత్రులు శ్రీ డా. బి. రామ రాజుగారు వ్రాసిరి. ఇంతకుమించి ఆ మూలశ్లోక తాత్పర్యభారతమును గూర్చి మఱేమియు నిప్పటికిఁ దెలియదు. క్రీ. శ. 1833-79 ప్రాంత మందున్న త్యాగరాజమొదలి అను తమిళుఁడు మొత్తము భారత మును దెనుఁగున వ్రాసినట్లు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారివల్ల తెలియుచున్నదే గాని తత్ప్రతి మాత్రము నేఁటికిని లభించలేదు. ఈ యిరువదవ శతాబ్దముననే ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు, తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు భారతరచనకుఁ బూనుకొనిరి. వ్యాసమూర్తి శాస్త్రిగారి ఆదిపర్వము మాత్రము ప్రకటింపఁ బడినది. సనత్సుజాతీయ మొకసారి భారతపత్రికలో వచ్చినది. మిగిలిన భారత గ్రంథము నాయన వ్రాసి ముగించెనో లేదో తెలియదు. నరసింహా రావుగారి విషయముకూడ అంతే. ఉద్యోగ పర్వములోని కొన్ని అక్కడక్కడి పద్యములు మాత్రము భారతిలో వచ్చినవి. 16, 17 శతాబ్దములలో వచ్చిన ద్విపద భారతము కవిత్రయమువారి ఆంధ్ర మహాభారతమునే అనుసరించినదగుటచేత ప్రస్తుతమునకది అంత విశే షము కాదు. ఏమనఁగా భారతమును వ్రాయుట కుపక్రమించిన అంద ఱును కవిత్రయమువారు చేయనిదేదో తాము చేయఁదలఁచినట్లు చెప్పు కొన్నవారే. అథర్వణ భారతావతారిక లభించలేదు. గనుక ఆయన ఏమి చేయఁదలఁచినదియు మనకుఁ దెలియదు. వీరరాఘవయ్య కవిత్ర యమువారు మూలశ్లోకముల నన్నింటిని దెనిఁగించనందున దాను మూలశ్లోకములయర్థమంతయుఁ దెడుఁగున వచ్చునట్లు వ్రాయుటకుఁ

బూనుకొన్నానని చెప్పెను. కవిత్రయమువారి తరువాత వ్యాసభారత మును యథామూలముగా ననువదింపవలయునని నవీనకాలమునఁ జేయఁబడిన ప్రయత్నములలో శ్రీ త్యాగరాజమొదలి రచించిన మహాభారతము మొదటిదని శ్రీ వేంకటరావు పంతులుగారు వ్రాసి యుండుటచేత మొదలి అభిప్రాయముకూడ నదియేయని మన మను కొనవచ్చును. అటుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు వ్యర్థపదములు లేకుండ కేవలము మూలము ననుసరించి వ్రాయవలయునన్న సంకల్ప ముతో భారతరచన కుపక్రమించినట్లు తెలియుచున్నది. తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు. తిక్కన్నగారి భారతము మూల మునకు భిన్నముగను మఱియు నసందర్భముగను నున్నందున తాము తిరిగి మూలానుసారముగాసందర్భశుద్ధిని బాటించుచు వ్రాయఁదలపెట్టి నట్లాయన భారతి పత్రికలో నుదాహరించిన పద్యములే చెప్పుచున్నవి.

ఈవిధముగాఁ గవిత్రయమువారి పరువాత జరిగినభారతము వ్రాయు ప్రయత్నములోఁ దుదముట్టి నేఁడు మన కుపలభ్యమగు చున్నది. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిగారి శ్రీకృష్ణభారతమే శ్రీశాస్త్రి గారు భారతమును దిరిగి యెందుకు వ్రాసినదియు, ఎట్లువ్రాసినదియు రేఖామాత్రముగా సూచించుటయే యీవ్యాసము పరమార్థము. శ్రీ కృష్ణ భారతమునందలి రచనా శిల్పమునుగూర్చి ఈ నా వ్యాసమున నేమియును వ్రాయఁబడదు. ఆంధ్రమహాభారతమును శ్రీ కృష్ణభార తమును బోల్చుచు నేయే విషయమున నెట్లు భేదించినదియు మఱియొ కసారి వ్రాయుదును. ప్రస్తుతము శ్రీకృష్ణ భారతము స్వరూపస్వభావ ములను గూర్చి మనవిచేయుదును.

ఇరువది సంవత్సరముల వ్యవధిలో నొక యెనిమిదేండ్లలో శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు భారతమును వ్రాసిరి. క్రీ. శ. 1906 సంవత్సరమున మొదలుపెట్టఁబడిన శ్రీకృష్ణభారతము రచన 1926 వ

సంవత్సరమున ముగిసినది. ఈభారతమును రచించుటలో శ్రీ శాస్త్రి గారు దక్షిణాది సంస్కృత భారత ప్రతులతోపాటు బొంబాయి, పూనా; కలకత్తా, ప్రతులను మఱిరెండు వ్రాఁతప్రతులను దాము సంపాదించినట్లును, అందు కలకత్తాప్రతి బాగున్నదనియు నీవ్యాస కర్తతోఁ జెప్పిరి. డా॥ దివాకర్ల వేంకటావధానిగారికి తమ భారతాం ధ్రీకరణము విషయమును దెలుపుచు శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసినదానిలో నిట్లున్నది. "నేనుచూచిన భిన్న దేశ ప్రతులు, బొంబా యిప్రతి, కలకత్తాప్రతి, దక్షిణదేశపుప్రతి, మఱియొక విదేశపు ప్రతి ఇవి అచ్చు పడినవి. ఇాదు రెండు పుస్తకములు తెలుఁగులిపి. తక్కినవి దేవనాగరము. ఇవికాక 3,4 వందల యేండ్లనాఁడు వ్రాయఁబడిన తాటి యాకు ప్రతులు రెండు. అందొకటి సాము సాము నూత్రము మఱి యొకటి పూర్తిగా నున్నదిగాని శ్లోకములు చదువశక్యముగానట్లున్నది. ఇవన్నియుఁ గొంచెమో గొప్పయో చూచి నారచన సాగించితిని. నన్నయాదుల గ్రంథములు కూడ చూచుచునే వ్రాసితిని. తాళపత్ర ప్రతులు నాఁటికి నాఁడే చూచినంతవఱకు పిండియగుచు వచ్చినవి. తక్కిన ప్రతులు సామాన్యముగా నన్నియుఁ జూచితిని గాని దేనిననుస రించితినో ఏ ప్రతి నేను ప్రమాణీకరించుకొంటినో ఇప్పుడు చెప్పలేను. అన్నిఁటిలోను నాకు విరుద్ధమైనది దాక్షిణాత్య ప్రతి. అది శుద్ధము కాదు. కొన్నిచోట్ల తెలుఁగు చూచి సంస్కరించెనని కూడ నున్నది. ఇది లేఖలోని విషయము. మఱియు శ్రీకృష్ణ భారతము అను శాసనిక పర్వము ఇరువదియైదవ పుటలోని అధో జ్ఞాపికలో శ్రీ కృష్ణమూర్తి శాస్త్రి గారిట్లు వ్రాసిరి "బొంబాయి కలకత్తాలయందు ముద్రింపఁ బడిన నాగరప్రతులును మదరాసునందు ముద్రింపఁబడిన తెలుఁగు ప్రతులును (నేను సంగ్రహించిన) మఱికొన్ని తాళపత్ర ప్రతులును కొన్ని ఆంగ్లేయపరివర్తనములును పరిశీలించి చూచితిని" ఈపై యుద్ధ

రింపులను బట్టి శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారే యేసంస్కృత భారత ప్రతులాధారముగా జేసికొని తమశ్రీకృష్ణ భారత రచన సాగించిరో తెలియఁగలదు.

కవిత్రయము వారి భారతమున్నది గదా తిరిగి మీరీ భారతమును వ్రాయుటలోని మీ యుద్దేశ్యమేమని ఈ వ్యాసకర్త శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారి నడుగగా వారికంటె కవిత్వము బాగా వ్రాయుదుననికాదు. వారు చాల భాగాలు వదలివేసినారు. సంస్కృతమునకు భిన్నముగా వారు వ్రాసిరి. ఎక్కువ చేసినచోట తప్పు చేసిరి. తక్కువ చేసినచోట లోపములున్నవి. అందువల్ల వ్రాసితిని. అని ఆయన చెప్పెను. శ్రీకృష్ణభారతమునకు భావార్థదీపిక—అను పేర శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారే ఒక వ్యాఖ్యానమును వ్రాసిరి. అది యముద్రితము మఱియునది యసమగ్రము. ఆవ్యాఖ్యానము ఆదిసభావర్వములకును, అరణ్యపర్వము ప్రథమాశ్వాసమునకుఁ బూర్తిగను ద్వితీయాశ్వాసము మొదటియేఁబది పద్యములవఱకును నున్నది. నా యనువాదమును గూర్చి యందు వ్రాసితిని చూచుకొనుఁడని శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారీయఁగా దానినీ వ్యాసకర్త యామూలాగ్రము చూచెను. అందు శ్రీకృష్ణ భారతాంధ్రీకరణము విషయమును ప్రస్తావించి శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారిట్లు వ్రాసిరి. "ఇక నీ భారతాంధ్రీకరణము విషయమించుక తెలుపనైయున్నది. నన్నయాదులు తెనిఁగించిన భారతము వెలుఁగుచుండ మఱియు భారతము మఱియొకండు తెలిఁగింపఁబూనుట సాహసమనకతప్పదు. అట్లయిన నిట్లేల సమకూడె నందురేని వినుండు. మనకవి కావ్య పాఠము చేయుకాలమున సంస్కృత భారతము తెనుఁగుభారతము చదువుచుండెడివాఁడు. తెలుఁగులో భగవద్గీతలు—ఉత్తరగీతలు—సనత్సుజాతీయము లోనగు ననేక విషయములు లోపించుటయు, అనేకవిషయములు వ్యత్యయవినిమయములఁబడి యుండు

టయుం జూచి, తెలుఁగులో లోపించినపట్ల మూలానుసారము సరిచేయుదునా యని సంకల్పించెంగాని యాసంకల్పము 20, 30 సంవత్సరములు గడచినను సరిపడినదికాదు. తుదకొక కాలమున లుప్తభాగములు సరిచేయ నుపక్రమించెంగాని ప్రతిస్థలమునందు నట్టిలోపములు తనకుఁ గానవచ్చుటఁజేసి సరిచేయుదునన్న సంకల్పమువిడిచి మఱియు నాదినుండియుఁ దెలుఁగు చేయవలసినదియే యని నిశ్చయించి యిట్లు కావించెను." మఱియు దీనితరువాత నున్న రెండవ పద్యము క్రింద వ్రాయు వ్యాఖ్యానమున

"ఔచిత్యంబు గ్రహించి మూలం బతిక్రమింపకుండ యథోపయోగంబుగా" వ్రాయుదునని వ్రాసి "ఇట్లు వ్రాసినమూలానుసారమగు నాయందు లేనివినుండు. భారతము పురాణమువలె నుండునది. కావ్యమువలె నుండదు. చెప్పినవిషయమే మఱియు మఱియుఁ జెప్పఁబడుచుండును. పరీక్షిత్తుకథ 3. 4 పర్యాయములీ యాదిపర్వమున నున్నది. దుర్యోధనాదుల పేర్లు 2, 3 మాఱులు మాఱి చేరి పడియున్నవి. ఉన్నవెల్ల ఉన్నట్లు వ్రాయుచో తెలుఁగు తెగులు కాక మానదు. పాఠకులకు రుచింపదన్న భయంబునఁ దత్తద్విషయములన్నియు నొక్కచో వ్రాసి తక్కినఆయాచోట్ల సంక్షేపించె. అదియే యౌచిత్యంబు గ్రహించి మూలం బతిక్రమింపకుండ ననఁగా-" అనియు శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిరి. శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారి భారత రచనా ప్రణాళిక ఈయన్నింటినిబట్టి కొంత తెలిసికొనవచ్చును. శ్రీశాస్త్రిగారు వ్రాసిన భావార్థదీపిక అను వ్యాఖ్యానము ముద్రింపఁబడినచో మఱికొన్ని శ్రీకృష్ణభారతరచనలోని విశేషములు తెలియవచ్చును.

మొత్తముమీఁద శ్రీకృష్ణభారతము గూడ ఏయొక్క సంస్కృత ప్రతికిని సరియైన అనువాదము కాదనియే చెప్పవలయును. మఱి నా

ల్గైదు సంస్కృతభారత ప్రతులయందున్న విషయములొక క్రమమున ననువదింపఁబడి శ్రీకృష్ణ భారతమైనది. ఆ నాలుగైదు సంస్కృత ప్రతులయందును లేక, కవిత్రయము వారి భారతమునందున్న విషయములను గొన్నింటిని శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు తమ భారతమున వ్రాసిరి.

కవిత్రయము వారి ఆంధ్రమహాభారతమున కంటె శ్రీకృష్ణ భారతము సర్వవిషయముల యందును లెస్సగాఁ బెరిగి యున్నది. ఇందు కొక్క విరాటపర్వమే అపవాదము. ముఖ్యముగా శాంత్యనుశాసన పర్వములు ఆంధ్రమహాభారతములోని వానికంటె రెండింతలుగా నున్నవి. శ్రీకృష్ణ భారతము దృష్ట్యా చూచినచో డాంధ్రమహా భారతము బహువిధముల సంక్షేపింపఁ బడియున్నట్లు కనిపించును.

ఎంతగా నౌచిత్యంబు గ్రహించి వ్రాయఁబడినను శ్రీకృష్ణభారతమునను బునరుక్తము లుండనేయున్నవి. ఆంధ్ర మహాభారతమున నున్న పునరుక్తములు దీనియందును నున్నవి. ఆవిషయము తెలిసియే శ్రీశాస్త్రిగారు వ్రాసినారు. శాంతిపర్వము పంచమాశ్వాసమునందలి పితాపుత్రసంవాదరూప ఇతిహాసమున నధోజ్ఞాపికలో "ఈకథ పెక్కు ప్రతులయందు రెండుసార్లు పడియుండుటచేతను, అక్కడ సోమయాజి భారతములో రెండుసార్లుండుటచేతను, ప్రమాదమని తెలిసియును, నేను నాయీభారతములో మూలములోనున్నట్లు రెండుసారులును వ్రాసితిని." అని శ్రీ శాస్త్రిగారు సూచించినారు. మఱియు నిట్లే "ఇట్టికథ శిబిని వర్ణించుసందర్భమునఁ జెప్పఁబడియున్నది. మఱియు నిటఁ గొంతమార్పుతో ననేక ప్రతులయందుండుటచేత నిది యట్టికథయేగాని యదియిదిగాదని నిశ్చయించి సోమయాజి భారతమున లేకున్నను నేనిందుఁ బొందుపఱిచితి" నని అనుశాసనపర్వము ద్వితీయాశ్వాసమున 'వృషదర్భుఁడు-కపోతము' కథ అధోజ్ఞాపికలో శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి.

కవిత్రయమువారి ఆంధ్రమహాభారతమున లేక శ్రీకృష్ణభారతమున ప్రధానముగా కొట్టవచ్చినట్లుకనిపించునవి : 1. సనత్సుజాతీయము 2. భగవద్గీత 3. శివసహస్ర నామములు 4. విష్ణు సహస్ర నామములు.

వీరరాఘవయ్యమొదలైనవారివలెనే శ్రీశాస్త్రిగారును భారతము మూలానుసారముగా నుండవలయునని సంకల్పించి వ్రాసిరి. కాని అసలు మూలమేదియో తెలియఁబడని స్థితిలోనున్నది సంస్కృతభారతము. అందుచేత వ్రాసినంతవఱకు నేదేనొకదానిని మూలముగాఁ జేసికొని వ్రాయఁబడిన శ్రీకృష్ణ భారతమును బ్రమాణముగా భావించి ఆంధ్రమహాభారతముతోఁ బోల్చి కథావిషయమును బరిశీలింపవచ్చును. ఆపని మఱియొకసారి చేయఁబడును —ఇతి శివమ్.

## గ్రాంథికభాషా సంరక్షకులు

### శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు; వారి గుణవిశేషములు

(బండారు తమ్మయ్య)

శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారితో బహుసంవత్సరములనుండి పరిచయము, మైత్రి గల వారిలో నేనొకఁడను. వయస్సులో వారు నాకన్న నిరువదియైదు సంవత్సరములు పెద్దవారు. ఇందుపల్లి వాస్తవ్యులు కీ॥ శే॥ శ్రీ పుల్లెల శ్రీరామశాస్త్రిగారు (క్షేమణి పత్రికాధిపతులు) రాజమహేంద్రవరములోఁ జిరకాలము నివసించినపుడు శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారికి అనుచరులుగా నుండెడివారు. శ్రీ రామశాస్త్రిగారు నాకుఁ జిరమిత్రులు. నేను అమలాపురములోని యున్నత పాఠశాలలో విద్యార్థిగా నున్నప్పుడు కొంతకాల మాంధ్రభాషాధ్యాప

కులుగఁ గూడఁ బనిచేసినవాఁడు. కృష్ణమూర్తిశాస్త్రిగారిని మాకోనసీమ సంచారమునకుఁ దీసికొనివచ్చినపుడెల్ల శ్రీరామశాస్త్రిగారు, మాయింటి సమీపమున నివసించు మిత్రులు కీ॥ శే॥ శ్రీ నేమనూరి శేషగిరిరావు పంతులు (ప్లీడరు) గారి యింట బసనేర్పాటుచేసి యుభయులు వారి యతిథులుగా నుండెడివారు. ఆదినములలో శ్రీరామశాస్త్రిగారు నాకుఁ గృష్ణమూర్తిశాస్త్రిగారి స్నేహమును నాదరణమును గలిగించిరి. కోనసీమ సంచారములో మేము మువ్వురము కొంతవఱకుఁ గలిసియే తిరిగెడివారము. అందుచేఁ గృష్ణమూర్తిశాస్త్రిగారి స్వభావగుణములతో నాకు 1920 సంవత్సరము ప్రాంతమునుండి స్వానుభవపూర్వకమయిన పరిచయమేర్పడి నానాఁటికి వృద్ధినొందినది. ఇతరులతో నాయెదుట మాటాడునపుడెల్ల శాస్త్రిగారు మా చిరకాల పరిచయ విషయము నుదాహరింప కూరకొనెడివారు కారు. వారు మొదటినుండియు సహజకోమల విశాలహృదయులు. ఆంతరంగిక మిత్రులకు వారి నవనీతహృదయము నిరంతరము నవగతమగుచునే యుండెడిది. "నిండుమనంబు నవ్యనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము" అనుమాట వారియెడ వారి ననుచరులకనుభవసిద్ధము—వారిమాటకేమాత్రమడ్డు సెప్పినను బరమమిత్రులపయిఁ గూడ వారు భగ్గున మండిపడెడువారు. కాని తాటాకు మంట వంటి యా యావేశము చల్లాఱఁగనే యెప్పటి సౌమ్యత నా వెంటనే ప్రకటపఱిచెడువారు. గోత్రకర్తయైన కౌశికుని యంశమిట్లు కోపవిషయమునఁ దమకలవడినదని దానిని మరల్చుకొనలేకుంటిమని వారేస్వయముగ మిత్రులకుఁ జెప్పుచుండెడివారు. నైజగుణంబు లేరికి మాన్పశక్యముగానివన్న సంగతి లోకమునకెల్ల ననుభవసిద్ధమేగదా! కావున నాకస్మికము క్షణికమునయిన శ్రీ శాస్త్రిగారి యీకోపగుణమునుగూర్చి విశేషముగను టంకించుట యనవసరము. గుణగ్రహణ విషయమునఁ గులమత

పక్షపాతముల కిసుమంతయు వీరి యకల్మషహృదయమున స్థానముండె డిది కాదు. శాస్త్రిగారి జీవిత మశేషము భాషాసేవ కంకితమయిన దనుట సర్వవిదితము. చిన్నవేవి, పెద్దవేవి, రమారమి రెండువందల గ్రంథముల కెక్కువగనే వారు రచించియున్నారు. ఆంధ్ర భాషలో రామాయణము, భారతము, భాగవతమునవెడి యుద్గ్రంథములకు నుపలబ్ధములయిన యనువాదము లొక్క చేతిమీఁదుగ రచితములైనవి కావన్న యాక్రోశమే, ముఖ్యముగ నీగ్రంథములను దానొక్క చేతి మీఁదుగనే యనువదించి ప్రకటింపవలెననెడి యావేశమునకయి శ్రీ శాస్త్రిగారికి దోహదమొనరించినదని నా యభిప్రాయము. శ్రీనాథకవి సార్వభౌముని యెడ వీరికిఁ గల గౌరవమునకు మేరలేదు. అతఁడప్రతి ముఁడని యాతని కవిత యసాధారణమని వారు పలుసారులు బాహా టముగఁ బ్రస్ఫుటముగ వాకొనుచుండెడివారు. అట్లయ్యు శ్రీనాథుని కావ్యముల కెల్ల వీరు మరల స్వతంత్రానువాదములు రచించి ప్రకటించు టకుఁ గల కారణ మాతని యెడ వారికిఁ గల యపారగురుభక్తి గౌర వములను బ్రకటించుటకే గాని యాతని కన్న మిన్నగా వానిని రచించి స్వశక్తి నుద్ఘాట మొనర్తుననెడి యుబలాటము కాదు. పూర్వాంధ్ర కవులలోఁ గృతికర్తలు, కృతిభర్తలుగఁ గూడ వెలసినవారు—పాలకు రికి సోమనాథుడు, తిక్కన సోమయాజి, కృష్ణదేవరాయలు, తంజా వూరి రఘునాథ భూపాలుఁడు మున్నగు నే కొలఁదిమంది మాత్రమే యున్నారు. అనన్యసామాన్యమగు నిట్టి గౌరవము నేఁటి వారిలో శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారికే మరల లభ్యమగుట ముదావహ మగు విశేషము. తిక్కనవలె "సుకవీంద్ర బృందరక్షకుఁ డెవ్వఁడనిన వీఁడను నాల్కకుఁదోడ వైనవాఁడు" అను సన్నుతికిఁ గాని, కృష్ణ దేవరాయ, రఘునాథరాయలవలె నాంధ్రభోజ ప్రశస్తికిఁ గాని, శాస్త్రిగారి విషయమున నంతగా నవకాశమున్నను లేకున్నను, వారు

కృతిభర్తలుగఁ గూడ నిరాజిల్లినది మాత్రము విస్పష్టము; శాస్త్రి గారి ప్రసిద్ధి, ప్రశస్తిని గుర్తించి పలువురద్యతనకవులు తమ కృతు లను గొన్నిటిని వారి కంకితమొసంగుటయే గౌరవాహముగాఁ దలఁ పోసి, కేవలము ధనరూపక సత్కారములను శాస్త్రిగారి నుండి విశేష ముగ నాశింపకయే వారి కొసంగినారు. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి గారు, కొమాండూరి కృష్ణమాచార్యులుగారు (గుంటూరు) రేజేటి సీతారామస్వామిగారు, కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు మున్నగు వారిట్టి వారు. శాస్త్రిగారు చిన్నప్పటినుండియు ధైర్య, సాహసములు నైజములుగా వెలసినవారు. వారి జీవితములోఁ బెక్కు ఘట్టములిందుకుఁ దార్కాణములు కాఁగలవు. స్వతంత్ర జీవనమే వారి లక్ష్యము. ప్రత్యేకముగఁ బత్రికలను నెలకొల్పి, ప్రబంధములు, నాటకములు మున్నగు పలుకృతుల రచించి యితరుల కంకితమొ సంగి,తన్మూలమున ధనార్జన మొనర్చి జీవించుటయే ప్రయోజనముగ వారు గ్రహించిరి. కాని యే ప్రభువులయొద్దనో యాస్థానకవిగఁ గాని, ఏకళాశాలలలోనో యధ్యాపకులుగఁగాని కుదిరిబ్రదుకుసాగించుటకయి వారిచ్చగింపలేదు. ఇదియే వారి జీవితమున నొక గొప్ప విశేషము. అన్నిటికన్న మిన్నగా వీరి జీవితమును మెఱయించినది వీరియాతిథ్య గౌరవము. రేపటికేమున్నది యను విచారము లేక యెప్పటికప్పుడే యార్జనము నెల్ల నర్థులకు నతిథులకునయి వినియోగించుట సర్వ విశ్రుతము. ఈవిషయమున వీరు పూర్ణముగ శ్రీనాథ గురువర్యుని ప్రతిమూర్తియే.

ఆంధ్రాస్థానకవి పదవి నందకమునుపటి నుండియే చిరకాలముగ శాస్త్రిగారు ఆంధ్రసాహిత్యపరిషత్తునకు గౌరవసభ్యులుగా నుండి పరి షత్తునం దపారగౌరవము గలిగి దాని యభ్యుదయము నాకాంక్షించు చుండెడివారు పరిషత్తు యొక్క యభిప్రాయము, సామ్రాజ్యశాసన ముగాఁ (Parliamentary command) జెల్లవలెనని, పరిషత్తు

నామోదముద్ర నొందని యేగ్రంథమును బ్రభుత్వము పాఠశాలా కళాశాలలందుఁ బాఠ్యగ్రంథముగా నిర్ణయించరాదని వారు సర్వదా సంభాషించుచుండెడివారు. వ్యావహారిక భాషావాదములు చెలరేగి వాని ప్రవాహములు దేశమును ముంచి యెత్తి భాషను సర్వనాశన మొనర్పకుండ నానకట్టవలె, 1911 సంవత్సరమున మహారాజుల యాదరణముతో శ్రీజయంతి రామయ్యపంతులుగారుఁ మొదట మదరాసులోఁ బ్రతిష్ఠించిన యీ పరిషత్తు మూలముననే గ్రాంథికాంధ్రభాష యింతవఱకు సంరక్షితమయినదనియు నిట్టి రక్షణమునకయి యాంధ్రవిశ్వకళాపరిషత్తు గాని మఱేపరిషత్తుగాని పూనుకొనియుండలేదని మాటిమాటికిఁ బ్రతి బహిరంగసభయందును శాస్త్రిగారు బాహాటముగ నుపన్యసించెడివారు. పరిషదాశయముల కనుగుణముగఁ బనిచేసి దానికిఁ దోడ్పడుటకై వ్యావహారిక భాషావాదులను బ్రతిఘటించుటకయి శాస్త్రిగారు తాముస్వయముగా "వజ్రాయుధము" అను మాసపత్రికను బ్రత్యేకముగ స్థాపించి తమ యాజమాన్యమునఁ గొన్ని సంవత్సరములు నిర్వహించినారు. సాహిత్యపరిషత్తు స్థాపితమయిన తొలిదినములలో దాని యాశయముల నామోదించి దానితో సహకరించిన పలువురు పండితులువిద్వత్కవులుశ్రీచెళ్ళపిళ్ళవేంకటశాస్త్రి, వేటూరిప్రభాకరశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మున్నగు వారు కొందఱు క్రమక్రమముగ వ్యావహారిక భాషావాద వశ్యులయి తమ వచనములను వ్యాసములను గొన్నింటిని వ్యావహారికభాషలో రచించుట కుపక్రమించిరే గాని శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు మాత్రము కలలోనైన నట్టి యభిచారమునకుఁ గడంగుట కిచ్చగింపరయిరి. గ్రాంథికభాషా సంరక్షణ విషయమున నాంధ్రసాహిత్యపరిషత్తునకు సహకరించుటకయి నడుముకట్టిన యచంచల దీక్షనుండి వారెన్నఁడు నేపరిస్థితులందు నించుకయుఁ జలింపరయిరి. పరిషత్కార్య నిర్వాహక

వర్గమునకు సభ్యశ్రేష్ఠులుగా నిర్ణీతులు గాక మున్నే చిరకాలము క్రిందటనే మొదటినుండియే వారి దీక్షాస్వీకరణ మొనర్చియున్నారు. వారి యండ కొండవలెఁ బరిషత్తును గాపాడుచుండెడిది. అన్నిటికన్న మిన్నగా శాస్త్రిగారి జీవితమందలి యీ విశిష్టగుణవిశేషమే నన్నలరించి చివరివఱకు నన్ను వారి యాప్తకోటిలో నిల్పినది. గ్రాంథికభాషా సంరక్షకునిగా శ్రీరామయ్యపంతులుగారితోఁ పాటు, కృష్ణమూర్తిశాస్త్రి గారిని నేను నిరంతరము సంభావించి సంస్మరించి సంసేవింతును. పెట్టని కోటవలె పరిషత్తును సంరక్షించుచుండిన యీ యిద్దరు ధీరవరుల నిర్యాణములు పరిషత్తునకుఁ దీఱని లోటును గలిగించి ప్రభంజన ప్రఘాతములవలెఁ బరిణమించిన వనుట మున్మాటికి నిక్కువము.

## కవిసార్వభౌమ సంస్మృతి

౧

కవిరాజ, సాహిత్యవిశారద, శ్రీ ఉప్పాడ రాజారావు, యమ్. ఏ.,

శ్రీపాదాన్వయ కృష్ణమూర్తి ! ఘనశాస్త్రీ! వాఙ్మయాంభోనిధిన్
ఆపోశించిన కుంభసంభవ ! సమగ్రాంధ్రావనీ సాహితీ
వ్యాపారస్తుత కేంద్ర రాజము! యశోవ్యాప్తా! విశుద్ధ స్వభా
వా! పూర్ణాయురుపేత సత్కవికులస్వామీ! నమోవాకముల్

నన్నయభట్టు నాంధ్రకవినాథుఁడు తిక్కన శంభుదాసుఁడున్
మున్నురచించు భారతము మూలవిధేయముగామి సర్వ వి
ద్వన్నుత కృష్ణభారతము వ్రాసి మహామహిమంబుఁ గంటి
వన్న నితోఽధికస్తుతియొ యర్హము నీకగుఁ గృష్ణసత్కవీ !

శ్రీమద్భాగవతంబు, రామకథయున్, శ్రీభీమఖండంబు, హా
ర్షామోఘ గ్రథనంబు, నైషధము నాంధ్రించుచుఁ గీల్కొల్పి వి
ద్యామూర్తిన్ విలసిల్లునో యభినవ వ్యాసా! యశోరాశి! స్వ
ర్భూమిన్ జేరితె నాకలోకసుఖముల్ భోగింప విద్వత్కవీ ! 3

అమర భాషావి యన్నది నాంధ్రభూమిఁ
గ్రుమ్మఁజేసిన నవభగీరథుఁడ వీవ
దేశి కవితాప్రకాశ వాగీశుఁ డీవ
సర్వవినుతాంధ్ర కవికుల సార్వభౌమ ! 4

వజ్రాయుధము కళావతినామకంబులౌ
పత్రికారాజముల్ ప్రచురపఱిచి
అచ్చుకూటమ్ము స్వీయమ్మను నెలకొల్పి
వాఙ్మయోపాసనను నొనర్చి
అనువాదములును స్వయంకృతమ్ములు రెండు
వందల కృతులను వ్రాసిమించి
మణికిరీటమును బ్రహ్మరథంబు మున్నగు
సత్కారములను యశస్సుఁ బడసి
భారతాంధ్ర ప్రభుత్వ సత్కారమంది
వేనవేల్ రొక్కమార్జించి వినుతిఁగాంచి
నిత్యదారిద్ర్యము నుద్యోగనియతిఁ గనిన
కృష్ణకవిసార్వభౌమ ! సుకృతివి నీవ. 5

అడిగిన తోడనే తడయక చేతిలోఁ
గలదాని నర్థిలోకమున కిడుట
అతిథి పంక్తినిలేక యాపోశనము సల్ప
నేరని వైదికనియతిఁ గనుట

కలదు లేదను చింత లొలయక నిలయాభి
యాతి నిమంత్రణ ప్రీతిమనుట
ఎదురాడ నాత్మీయు నేని లెక్కింపక
ప్రథమ కోపంబునఁ బలుకుచుంట
పేద గుండెయును స్వపరభేద రహిత
కల్మష విహీన చిత్తము కవికులాగ్ర
గణ్యతయు నార్షమహిమ బ్రహ్మణ్యతయును
బాదుకొనఁజేసె నీయందుఁ బావనాత్మ!
గ్రామ్య భాషావివాద నిరాసనైక
లక్ష్యనిష్ఠితమతిఁ గళాలక్ష్మి కాశ్రి
యమ్ము గామని, సాహితీ వ్యాప్తి నిడిన
కృష్ణకవిచంద్ర! శతనమస్కృతులు నీకు.
కృతి కర్తవు, కృతి భర్తవు,
కృత సుకృతివి, విశ్రుతాంధ్ర గీర్వాణ సమా
దృత వాఙ్మయాకృతివి, నీ
స్తుతి సల్పుటవాణిఁ గొల్చుచుండుటయె కవీ!

౩

శ్రీ ఉభయభాషాప్రవీణ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రిగారు

సీ. పుంజీభవించె నే పూజ్యపాదుని యందు
బాదరాయణ మహాప్రథితధిషణ
మూర్తీభవించె నే పూర్ణులో వాల్మీకి
గంభీర తర భావగుంభనంబు
ఏకీభవించె నే లోకైకపూజ్యులో
నలకవిత్రయ ప్రతిభాభియుక్తి
వర్గీభవించె నే వరకవిరూపులో
శ్రీనాథ కవిరాజచిద్విలాస

గీ. మహాఁడు చెలుఁవాఁడు; కింకవివితతగర్వ
పర్వతాభ్రంలిహాగ్ర విభ్రాజమాన
శృంగభంగ ప్రశస్తివాసిత దిగంత
కలితవిశాల కీర్తి శ్రీకృష్ణమూర్తి.

సీ. కృష్ణయజుర్వేద కీర్తికాంతను దల
కెక్కించుకొన్న వాగీశమౌళి
పాణినీయమ్ము నాభాష్యము నాచమిం
చిన యపశ్చిమవిపశ్చిద్వరుండు
ధర్మశాస్త్రసమస్త మర్మకర్మముల నా
పోశనించిన పండితాధినేత
ఆదిపురాణమ్ము లనువదించి కదించి
తెలుఁగుబిడ్డలకిడ్డ దీప్తిశాలి

గీ. ఒక్కపూర్ణజీవితములో నొక్కమాఱు
చదువుటకు నైనలోఁగని సరసవాఙ్మ
యమ్ము తెనుఁగుల కందించి యలరినాఁడు
ఫణిపతిగఁ దోఁచు శ్రీపాదభవ్యసుకవి.

సీ. సవదరించెను మహాకవిపూజ లొకనాఁడు
కవిసార్వభౌముండు కాంచినట్లు
ఏనుఁగంబారీల నెక్కినాఁ డొకనాఁడు
పూజ్యుఁడు పెద్దన్న పొందినట్లు
పోతన్నరీతి నొప్పాంగినాఁ డొకనాఁడు
సరసవాణీ కృపాకటాక్షంబు కలన
శాపాక్షరంబులఁ జల్లినాఁ డొక్కనాఁ
డల వేములాడ భీమన్న కరణి

కాళీకాలోలదృక్కేళి కావిలోల
డోలికాలోల ఖేలన బాలకుండు
కాళిదాసుని కరణి నుయ్యాల లూంచి
మించి భారతి నితఁడు లాలించినాఁడు.

సీ. అష్టావధాన శతావధానపు బంతు
లాటలలోఁ బేరు నందినావు
గండపెండెరము బంగరు కిరీటములంది
కవిసార్వభౌమతఁ గాంచినావు
కృతకృత్యతను దృణీకృత జగత్త్రయ సత్వ
సారుఁడవై చక్క సాగినావు
సంస్కృతాంధ్రములందు సాటిలేనటు కావ్య
సర్గముంజేసి విస్తరిలినావు
వందలాదిగ బిరుదము లందినావు
పొందియున్నావు బంగరు పూలపూజ
యుగయుగమ్ములు దాఁక నీయుర్వియందు
నిలుపుకొన్నావు ధ్రువరీతి నీదుపేరు.

ఉ. నీలసమానభూషలు మనీషి! స్థిరమ్ముగ నాంధ్ర విశ్వవి
ద్యాలయమందు నిల్పుటకునై యిడినావఁట యద్ది నీమహా
శీలము నీనిరీహమటి చెప్పక చెప్పుచునుండెఁగాదె, ల
క్షల్ములలనాంధబుద్ధుల కిసీ! తరమౌనె యిటుల్ ఘటింపఁగన్

మ. ఏనాఁడెప్పుడు నేశతాబ్దములలో నేగాని, యేభాషలోఁ
గానీ, యేపరదేశముల్ వనములున్ గాలించి గాలించినం
గానీ, యిట్టి బుధోత్తమున్ గవితనుం గాఞాచి, దర్శింపనుచ్
వీనుల్ సోఁకనుగూడ లేదనిన రానేరా ది దత్యుక్తిగా.

గీ. ఓయి కవిసార్వభౌమ! మహోజ్జ్వలాంగ !
యవతరించితి వ్యాసుని యంశతోడఁ
బూర్ణపురుషాయుషమ్ముతోఁ బొదలితీవు
నేఁటితో నీకు నూతేండ్లు నిండెనయ్య !

# ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళము

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, బి.ఏ.

(వెనుకటి సంచికల తరువాయి)

## ఏ ఱు వ నా డు

వెనుకటి సంచికలో ఏఱువనాటినిగూర్చి వ్రాసియుంటిని. ఈ ఏఱువను పేర్కొనిన ప్రథమాంధ్రకవి దశకుమారచరిత్రమును దెనిఁగించిన మూలఘటికకేతన. చోడతిక్కనృపాలుని ప్రతాపవర్ణన సందర్భమున తిక్కనృపతి ఏఱువమన్నీల నోడించినట్లు వ్రాసి యున్నాఁడు.

సీ. బలిమిచేఁ బృథ్వీశు తలదు్రించె సేవణ
కటక సామంతులగర్వ మణఁచె
ద్రవిళమాండలికులందఱఁ దక్కనేలెఁ జో
డని నిజరాజ్యపీఠమున నిలిపెఁ
గర్ణాటవిభు నహంకారంబు మాన్పించెఁ
బాండ్యునిచేతఁ గప్పంబు గొనియె
నేఱువమన్నీల నెఱిపుట్టగా నేలె
వైరివీరులవామలూర నోర్చె

తే. త్రిభువనీరాయ పెండారుఁ డుభయ కటక
వీరుఁడభినవభోజుఁ డాశ్రిత మదనుఁ
డవనిభార ధౌరేయు మహాత్వ విజిత
దిక్కరీందు్రఁడు చోడల. తిక్కనృపతి.

(దశకుమారచరిత్రము. పీఠిక)

ఈఏఱువనాటికి కోడూరు రాజధానిగనుండెను. ఈ కోడూరు గ్రామము కడప జిల్లాలోనిది. ఏఱువతొండయరాజు భార్య మైలమ

దేవి వ్రాయించిన ద్రాక్షారామ శాసనములో వెలువతొండయ కోడూరు పురవరాధీశ్వరుఁడని చెప్పఁబడినది.[1]

గిరిపశ్చిమ, గిరిప్రతీచి, కొండపడుమటి దేశము.

చోడ చక్రవర్తులకు సామంతులుగ నుండిన గిరిపశ్చిమ (కొండపడుమటి) ప్రభువుల శాసనములు గుంటూరు మండలములోఁ గలవు. వీనిలో బుద్ధవర్మ వంశములోని వాఁడైన కొండపడుమటి బుద్ధరాజు ప్రసిద్ధుఁడు. ఇతని శాసనములు నాదెండ్లలోని మూలస్థానేశ్వర దేవాలయమునఁ గలవు. ఈకొండ పడుమటిదేశమునందు డెబ్బదిమూఁడు గ్రామములు గలవని ఆశాసనములందుఁ దెలుపఁబడినది.

"స్వస్తి! సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీర మాహేశ్వర కుళోత్తుంగ చోళదేవ దివ్యశ్రీ పాదారాధకపరబలసాధక ...... విక్రమక్రీడావినోద ... వివేకపద్మాసన గిరిపశ్చిమ శాసన నామాది సమస్తప్రశస్తి సహితుండైన శ్రీమన్మహామండలేశ్వర బుద్ధనరేంద్రునకు ..."

2) స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీర మాహేశ్వర కులోత్తుంగచోళ దేవదివ్య శ్రీపాదారాధక సుజనవన వసంత కాంతాజయంత వివేకపద్మాసన గిరిపశ్చిమ శాసన ... శ్రీమన్మహామండలేశ్వర కొండ పడ్మటి బుద్ధరాజు."

3) ఆసీచ్చతుర్థాభి జనావతంసః శ్రీబుద్ధవర్మా కృత పుణ్యకర్మా
సంగ్రామరంగే నిజనాథవర్మా సంపాదితాశేష కవీంద్రశర్మా ॥
త్రిసప్తతి గ్రామవతీంమహీం మహీపతిః ప్రసాదోపనతాంనతాహితః
గిరిప్రతీచీన్నిజలాంఛనైస్స పాలయామాస విలాసవాసః ॥

ఈ కొండ పడుమటిదేశము సత్తెనపల్లి తాలూకాకుఁ దూర్పు భాగము. కోటసామంతుల శాసనములలో కొండపడుమటి దేశములో

1. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 4 సంఖ్య.

మేరుకొంఢూరు, డోంకిపఱ్ఱు, సత్తెనపల్లి, సాతులూరు, చింతపల్లి, ఎఱ్ఱగుంట గ్రామములుదాహరింపఁబడినవి. ఆగ్రామములే నేఁటి మేడికొండూరు, దోకిపఱ్ఱు, సత్తెనపల్లి, ఎర్రగుంట్లపాడు, అను గ్రామములు. ఈగ్రామములన్నియు నేఁటి సత్తెనపల్లి నరసారావుపేటతాలూకాలలోఁ గలవు [2]

ఆరాజన్యుల శాసనములలో నుదాహరింపఁ బడిన మఱికొన్ని గ్రామముల నీదిగువ నిచ్చుచున్నాఁడను.[3]

| | | | |
|---|---|---|---|
| 1. | సంక్రాంతిపాడు | సంకురాత్రిపాడు | నరసారావుపేట తా॥ |
| 2. | జీడెప్రూండి | జూప్రూడి | సత్తెనపల్లి తా॥ |
| 3. | భీమాపురము | భీమవరము | |
| 4 | దువ్వపాడు | దొండపాడు | నరసారావుపేట తా॥ |
| 5 | కేతెపల్లి | కేతవరము | సత్తెనపల్లి తా॥ |
| 6. | పాములపాడు | పాములపాడు | గుంటూరు తా॥ |

కొండపడమటి దేశమనఁగా కొండవీటికొండకుఁ బడమటి దేశమని యర్థము. గిరిపశ్చిమ దేశమునకే 'కుత్కీల ప్రత్యగుర్వి' యని దుర్జయ కులాంతస్సుడైన మండరాజు శాసనములో వ్రాయఁబడినది.[4]

సత్తెనపల్లి తాలూకాలోని సిరిపురము కొండపడుమటిలోనిదని సిరిపురముగ్రామములోని రెండుశాసనములవల్లనవిదితమగుచున్నది. A4

2. (1) దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 4. శాసనసంఖ్యలు 677, 678, 683. 690.

(2) దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 10. శాసనసంఖ్యలు 97, 107.

(3) పృథ్వీశ్వరుని పిఠాపురశాసనము.

3. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 6. సంఖ్య 98, 229.

4. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 4. శాసనసంఖ్య 927. కుత్కీల ప్రత్యగుర్వియనఁగా కొండ పడమటిభూమి.

4. A దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 10. సంఖ్యలు 177; 179.

1. కొండపడుమటిం బం(ద్రెడ్డుపూండ్ల సిరిపురంబున రామేశ్వర దేవరకు. ...

2. శ్రీమత్పర్వత పశ్చిమాఖ్య విషయే భక్త్యా ప్రదీపమ్ముదా గ్రామే శ్రీపురనామధేయ విదితే రామేశ్వరాహ్వయే.''

కండ్రివాడి, దొడ్డికండ్రివాడి, కొండనతవాడి విషయములు.

పైని పేర్కొనిన విషయములు నేటి గుంటూరు మండలము లోనివి. ఆయావిషయములలో శాసనబద్ధమైన గ్రామములనిచ్చి, వాని పేర్ల నుదాహరించుచున్నాను.

కండ్రివాడి

| | | |
|---|---|---|
| క్రింతేఱు | కంతేరు | గుంటూరు |
| గుడ్లపూడి | గుడిపూడి | సత్తెనపల్లి |
| అందుకూరు | అందుకూరు | ,, |
| కుంచులపల్లి | కుంచెనపల్లి | గుంటూరు |
| గుండిమెడ | గుండిమెడ | ,, |
| డావులూరు | దావులూరు | ,, |
| దుగ్గిఱేలపూండి | దుగ్గిరాల | ,, |

దొడ్డికండ్రివాడి (ద్రొడ్డకండ్రివాడి)

| | | |
|---|---|---|
| ఒంకదోన | ఉయ్యందోన | సత్తెనపల్లి తాలూకా |

కొండనతవాండి (కొన్నాతవాడి)

| | | |
|---|---|---|
| గింజనాడు | గింజుపల్లి | సత్తెనపల్లి తా॥ |
| చల్లగరా | చల్లగరిగె | ,, |
| తాడివాడ | తాడువాయి | ,, |
| ఉప్పలపాడు | ఉప్పుపాడు | ,, |
| అమ్మలపూండి | అంబడీపూడి | ,, |
| గంబాల మెట్ట | గుండాలపాడు | ,, |

ఈకండ్రవాడయే తూర్పుచాళుక్యుల శాసనములలో కండేరు వాడి యనియు, కాండేరువాడియనియుఁ జెప్పఁబడినది. రెండవ విజయాదిత్యుని ఈదర శాసనములోను, ప్రథమ చాళుక్యభీముని బెజవాడ శాసనములోను, కండేరువాడి, ఉత్తర కండేరువాడి విషయములు పేర్కొనఁబడినవి. రెండవ విజయాదిత్యుని కండేఱువాటి విషయము లోనిదని పేర్కొనఁబడిన కొట్టపట్టు గ్రామము సత్తెనపల్లి తాలూకా లోని కొట్టపాడు గ్రామమే. చాళుక్యభీముని బెజవాడ శాసనములోఁ బేర్కొనఁబడిన కూకిపట్టు సత్తెనపల్లి తాలూకాలోని డోకిపట్టు అను గ్రామమే.[5]

గుంటూరు తాలూకా మల్కాపురము శాసనములో కండ్రవాడి వెలనాటి విషయములోనిదనియు, దానికుత్తరమునఁ గృష్ణా నది గలదనియు వ్రాయఁబడెను. "విషయే వెలినాః కంఠ్రవాట్యాం విశేషతః। యదుత్తరేణ వహతి కృష్ణవేణీ మహానదీ॥

ఈశాసనములో కాకతిరుద్రమదేవి వెలగపూడి సహితముగా మందడము గ్రామము విశ్వేశ్వర శివాచార్యులకు దాన మొసంగెను. దీనిలో పేర్కొనఁబడిన మందడము, వెలంగపూండి, రావిపూండి, పెనుంబాక ఉప్పలపాడు గుంటూరు తాలూకాలోని నేఁటి మందడము, వెలగపూడి, రాయపూడి, ఉప్పలపాడు అనుగ్రామములే.[6]

కండ్రవాటిలోని కొంతభాగమునకు ఈవనికండ్రవాటి యని పేరు. ఈవని కండ్రవాటిలో గుండిమెడయను గ్రామమున్నదని బాపట్లలోని యొకశాసనమువల్లఁ దెలియుచున్నది. ఈవని గ్రామము

5. రెండవ విజయాదిత్యుని యొక్కయు, చాళుక్య భీమునియొక్కయు తామ్ర శాసనములు ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. సంఖ్య. 16 లోఁ బ్రకటింపఁబడినవి.

6. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 10. సంఖ్య 395. శ. సం. 1183.

తెనాలి తాలూకాలోను గుండిమెడ గ్రామము గుంటూరు తాలూకాలోను గలవు. డావులూరిలోని యొక శాసనములో ఈవని కంద్రవాటిలోని కుఱుంగల్లు గ్రామము పేర్కొనఁబడినది. ఈకుఱుంగల్లు గుంటూరు తాలూకాలోని కూరగల్లు అనుగ్రామము.[7]

కండ్రివాడి గుంటూరుతాలూకా, తెనాలి తాలూకా, సత్తెనపల్లితాలూకాలోఁ గొంతభాగమునకు సరివచ్చు: ప్రాచీన నాడీవిభాగమని పైశాసనములలో నుదాహరింపఁబడిన గ్రామస్థల నిర్దేశమును బట్టి యూహింప వచ్చును.

## కండేఱువాడి—గండేరువాడి

మొదటి చాళుక్య జయసింహుని నిడమఱ్ఱు శాసనములో కండేఱువాడి లేక గండేఱువాడి యనియుఁ బేర్కొనఁబడినది.

జయసింహమహారాజః గండేఱు వాట్యాం వ్యాఘ్రనద్యా శ్చోత్తరతటః వన్నెఱునద్యాశ్చ తీరే గండేఱు రాజధాన్యాః పూర్వ దిగ్విభాగే గవ్యూతిద్వయే నిడుబఱునామగ్రామం అధివసతః కుటుంబినః సమవేతా నాజ్ఞాపయతి (ఎపిగ్రాఫియా ఇండికా: సంపుటము 18. సంఖ్య 5)

పైనఁజెప్పఁబడిన గండేఱు రాజధాని గుంటూరు మండలములోని గుంటూరుతాలూకాలోనికంతేఱుగ్రామము;నిడుబఱె నిడుమఱ్రు. ఈగ్రామము కంతేరునకు తూర్పున నెనిమిదిమైళ్ళ దూరములోఁగలదు. గండేఱుదాఁటియే క్రండివాటి. నిడమర్రు వ్యాఘ్రనది కుత్తరమున వన్నెఱు తీరమున నున్నది. ఈవన్నెఱు వ్యాఘ్రనదుల స్థల నిర్దేశములు శాసన పరిశోధకులు చేయలేదు. భావిపరిశోధనలవల్లఁ దెలియగలదు. గుంటూరు తాలూకాలోని పులిగెడ్డయేరు వ్యాఘ్రనదియేమొ?

7. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 10. సంఖ్యలు 109, 112.

గుంటూరు మండలములోని తెనాలితాలూకా దుగ్గిరాలగ్రామములోని యొకశాసనములో కండ్రవాడీశ్వరుఁడైన భీముఁడు దుగ్గజేల ప్రూండిగ్రామము బ్రాహ్మణోత్తములకు దానము చేసెనని గలదు. దుగ్గిజేలప్రూండియే దుగ్గిరాలయను గ్రామము. ఈగ్రామము కండ్రవాడిలోనిదే యగుచున్నది.[8]

అతఁడే నూతక్కిలోని శక్తీశ్వర దేవరకు కొంతభూమిని దానము చేసినట్లు ఆదేవరయాలయములోని శాసనమునందుఁ గలదు. ఈనూతక్కిగ్రామము గుంటూరు తాలూకాలోఁ గలదు. కావున నూతక్కియు కండ్రవాడిలోని గ్రామమే.[9]

పైశాసనాధారములవల్లఁ గండ్రవాడియన్నను, కండేఱువాడియన్ననుఁ గండేఱువాడియన్నను ఒకేసీమకు నామాంతరములు.

## నతవాడి—పెన్నాతవాడి

ఈనతవాడిసీమకు ప్రాచీన శాసనములలో నత్రిపట విషయమను పేరుగలదని రెండవ విష్ణుకుండిన విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనము వ్యక్తపఱచుచున్నది. ఈశాసనము ఇప్పటి పడమటి గోదావరి మండలములోని వెందులూరునుండి ప్రకటింపఁబడినది. దానమీయఁబడిన గ్రామమున త్రిపటి విషయములోని కృష్ణానదీతీరముననున్న రావిరేవుల గ్రామమునకు ఆగ్నేయమూలముననున్న రేగొన్ఱయను గ్రామము. ఈరావిరేవుల నందిగామ తాలూకాలో నున్నది.[10]

8. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము. 10. సంఖ్య. 96.

9. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 10 సంఖ్య 102.

10. విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-4 శాసనసంఖ్య-25

ఈనతవాటిసీమనే కాకతీయులనాటి శాసనములలో శ్రీ నాథ వాటీసీమయని ఇది ధనధాన్యాది సంపూర్ణమనియు వర్ణింపఁబడినది.[11]

1. "తస్మిన్నుర్వతి రాజ్య మిద్ధమతులం త్యాగాంక పోతాధిపే,
ధనధాన్యాది సంపూర్ణే నాతవాటీ మహీతలే॥
2. శ్రీ మాన్పోతన ృపాత్మజో నృపవర శ్రీనాతవాట్యాం ముదా
న్నారీ శాంఘ్రి సరోజయుగ్మ మధు లిడ్విశ్వేశ్వర స్యాదరాత్॥
3. తత్పుత్రస్త్యాగిదోర క్షితిపతి రకరో దూర్జితం నాథవాటీ
రాజ్యం సౌరాజ్యరజ్య ప్రకృతి రవి కృతిశ్లాఘ్య స్తత్చరిత్రః॥

పెన్నాతవాడి పూర్వచాళుక్యరాజగు రెండవ అమ్మరాజు బందరు తామ్రశాసనములోఁ బేర్కొనఁబడినది. మొదటి చాళుక్య భీమునకు సైన్యాధిపతిగనున్న మహాకాలునకు పెన్నాతవాడి విషయములోని దుగ్గిజ్జూరుగ్రామము నతఁడు దానము చేసెను, ఆగ్రామము నకు సరిహద్దుగ్రామములు గొట్టిపోలు. మల్కాపురము, అడుపు, తాళుగుమ్మి అనునవి. ఆగ్రామము నేటి నందిగామతాలూకా యం దున్నవి. అడుపు గ్రామ మేదియో తెలియదు.[12]

దుగ్గిజ్జూరు—జుజ్జూరు తాళుగుమ్మ—తాడిగుమ్మి
మల్కారము—మలకాపురము గొట్టుపోలు—గొట్టుముక్కల

ఆతని దేయగు పడంకలూరు తామ్రశాసనములో పెన్నాత వాడి విషయములోని పడంకలూరు గ్రామములోఁ గొంతభూమిని దానముచేసినట్లు గలదు. ఈపడంకలూరు, నందిగామతాలూకాలోని పడకలూరను గ్రామమే.[13]

11. (1) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-10. సంఖ్య 259
(2) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-10. సంఖ్య 152.
(3) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-10. సంఖ్య 373.
12. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-5 శాసనసంఖ్య-16-D. పుట131.
13. ఇండియన్ అంటిక్వేరి. సంపుటము-7 సంఖ్య-15

బాపట్లలోని యొక శాసనములో 'శ్రీ భావనారాయణ దేవరకు పెన్నాతవాడిలోని చిలుకూరి చిక్కనాయకుని కొడుకు భీమనాయకుండు శ్రీభావనారాయణదేరకు అఖండవర్తిదివియకు వెల్లెడ్లు' దానము చేసెనని గలదు. ఈచిలుకూరు బెజవాడ తాలూకాలోని గ్రామము.[14]

పెన్నాతవాడి కృష్ణామండలములోని కృష్ణానది కుత్తరదిక్కు న బెజవాడ నందిగ్రామ తాలూకా ప్రాంతమని పైనుదాహరింపఁబడిన శాసనములవల్ల విశదమగుచున్నది. కోటబయ్యల దేవి అమరావతి శాసనములో ఆమె బుద్ధదేవునికి నాథవాడి లేక నాథవాటిలోని మడపల్లిగ్రామమునకు దానముచేసెనని కలదు. ఈమడపల్లి నందిగామ తాలూకాలోనే కలదు.[15]

క్షీరనది (పాలేరు). నతవాడి

ఇదివఱకు సూచించిన నందిగామ తాలూకా అనుమంచిపల్లి గ్రామములోని త్యాగిపోతరాజు శాసనములోన తవాడిసీమలో క్షీరనది ప్రవహించు చున్నదని, ఆక్షీరనది యొడ్డుననున్న పోతాపురము అనుమంచిపల్లిలోని శివాలయమునకు దానమొసంగెనని కలదు. ఈ క్షీరనదియే పాలేరు. కృష్ణానది కుత్తరముననీయేఱు, మూసినదుల మధ్యమున కృష్ణానదిలో కలియుచున్నది.

ధనధాన్యాది సంపూర్ణే నాతవాటీ మహీతలే
శాకాబ్దే వేదలోకేశమితే శ్రీముఖవత్సరే
పరోపకార సంపత్తి సిద్ధయే పుణ్యావృద్ధయే

14. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-6. సంఖ్య 187.

15. అమరావతిలోని రెండుశాసనములు ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-6 శాసనసంఖ్య-15-A.B.

తుల్యాం క్షీరనదీకుల్యాం కావేర్యా కృతవా నసౌ
పోతాపురాఖ్యం ప్రదితాగ్రహారం...''[16]

మార్జవాడ—మహారాజవాడి

నేటి దత్తమండలములలో కడప జిల్లాలోని ప్రఖ్యాతమైన ప్రాచీన విషయములలో నొకటి. దీనికి శాసనములలో మారాజవాడి మహారాజవాడి మార్జవాడరాజ్యము అనియు నామాంతరములు.

రాజాధిరాజ చోడుని మండకల్లు క్రీ.శ. 1047-48 నాటి కన్నడ శాసనములో నతని దండనాయకుఁడైన రాజేంద్రచోళ బ్రహ్మమారాయురు వల్లూరు రాజధానిగ మారాజవాడి (యేడువేలు) నేలుచుండెనని యీక్రిందివిధముగ వ్రాయబడియున్నది. "చోళనసింగమ్ రాజేంద్రచోళ బ్రహ్మమారాయర్ మారాజవాడి ఏళుసాసిరవన్ ఆళుత్తనల్లూరబిడిదల్ సుఖసంఘాట వినోదిమ్''[17]

అతని కాలము నాఁటిదేయగు మైసూరు రాష్ట్రములోని కోలారు మండలమునందలి చాకదపల్లిలోఁగల శిలాశాసనములోఁ పైవిషయమే విస్తరించి వ్రాయఁబడినది.

"చోళనసింగమ్ రాజరాజ బ్రహ్మన రాజర్ మహారాజవాడి ఏళుసాసిరమం పులినాడు ఎళువత్తురి ముఱుకినాఁడు మువ్నాఱుం ఆళుత్తం బల్లూర బిడిదల్ సుఖసంఘట వినోదరల్''[18]

పైశాసనములో ముఱికినాఁడు (ములికినాఁడు) పులినాఁడు పేర్కొనఁబడినవి. మహారాజవాడి ఏడువేలగ్రామపరిమిత విషయమని

16. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-10 సంఖ్య 259. (శాస-1134.(
17. రాజాధిరాజ మిండిగల్లు శాసనము ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-5 సంఖ్య-23.
18. Mysore Archaeological Department Annual Report 1928. శాసనసంఖ్య-31.

పై శాసనములలో వ్రాయఁబడియున్నది. అట్లే రేనాడు ఏడువేల గ్రామపరిమిత విషయమని ఇదివఱకు వ్రాసియున్నాను. రేనాటికే మహారాజవాడి పర్యాయపదమని శాసనపరిశోధకుల యభిప్రాయము. మిండికల్లు శాసనము ననుసరించి మహారాజవాడి రేనాటిని దాటి మైసూరు రాజ్యములో కోలారుజిల్లా తూర్పుభాగమువఱకు వ్యాపించి యుండవచ్చును. మార్జవాడిని పేర్కొన్న కొన్ని శాసనముల నుదాహరించు చున్నాను.

1. ఇమ్మడి నరసింహరాయుల దేవులపల్లి శాసనము—

"పెనుకొండ మహారాజ్యే మార్జవాడస్యసీమని గుండ్లూరునామ గ్రామస్య స్థలే విఖ్యాత నామకం .. దేవులపల్యాఖ్యం సర్వమాన్యత యాసితం.

ఇందలి దేవులపల్లి, గుండ్లూరు గ్రామములు వాయల్పాడు తాలూకాలో నున్నవి. (ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-7 పుటలు 74,75)

మార్జవాడ విజయనగరం రాజన్యుల కాలములో పెనుగొండ రాజ్యమున దంతర్భాగమై యుండెను.

2. విజయనగర సామ్రాజ్యమేలిన దేవరాయలు క్రీ. శ. 1405 నాటి తంబల్లపల్లి శాసనములో మార్జవాడలోని చంద్రగిరి పేర్కొనఁబడినది. ఈచంద్రగిరి చిత్తూరుమండలములోని చంద్రగిరి గ్రామమే.[19]

ఆంధ్రచరిత్రకారులు శ్రీ వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్ర రెండవభాగము 257-258 పుటలలో నీమార్జవాడిని గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

కడపమండలములోని పులివెందలతాలూకాలోని మోపూరు

19. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-9. ద్వితీయ భాగము. సంఖ్య429

మొదలుకొని మైసూరు రాజ్యములో చింతామణి తాలూకాలోని మిండిగల్లువఱకుఁ గల ప్రదేశమునకు మార్జవాడి లేక మహారాజపాడి (7000 గ్రామములుకలది) యనునామము కలదు. ఈనాటికి వల్లూరు పట్టణము రాజధానిగ నుండెను."

## మొ ట్ట వా డి

మొట్టవాడి నేటి కర్నూలు మండలములోని మార్కాపురము తాలూకా ప్రాంతభూమి. మొట్టవాడి లోనివని వివరింపఁబడిన గ్రామములు మార్కాపురము తాలూకాలోనే కలవు. ఆంధ్ర కర్ణాట శాసనములలోనుండి ప్రాచీనగ్రామముల పేర్లు నేటి వాని నామము లుదాహరించు చున్నాను.[20]

1. త్రిపురాంతకము—త్రిపురాంతకము.
2. పులచెఱువు—పుల్లలచెఱువు
3. చాపలమడుగు—చాపలమడుగు
4. కవులకుంట్ల—కొవులకుంట్ల
5. రాజకొండ—రాచకొండ
6. శతకోటి జన్ననిపల్లి—శతకోడు జమ్మనపల్లి
7. ముట్టువలు—ముటుకుల
8. కంభముపాడు—కంభంపాడు
9. మాద్రిపల్లి—మాడేపల్లి
10. దరిదాల్లమేడపి—మేడపి.
11. మరియంపాడు —మరియంపల్లె

20. (1) దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-6 సంఖ్య 128.
(2) డిటో శాసన సంపుటము-10 సంఖ్య 346.
(3), మొదలు (12) వఱకు త్రిపురాంతకములోని కన్నడ శాసనములు. శాసన సంపుటము-9 సంఖ్యలు-204. 212.

12. మువ్వలి—మవ్వలి

త్రిపురాంతకములోని కరికాళచోళుని క్రీ. శ. 1106 నాటియొక శాసనములో కరికాళచోళమహారాజు త్రిపురాంతక దేవునకు మట్టెవాడలోని పల్కూరు భోజనిసెర్వను దానముచేసెనని కలదు. పల్కూరు గ్రామము కర్నూలు మండలములో బనగానపల్లి జమీందారీలోనున్నది.[21]

కొణిదెన గ్రామములోని చెన్నకేశవస్వామి యాలయములో నొకఱాతిమీఁద చెక్కఁబడియున్న పద్యశాసనములో మొట్టవాడి పేర్కొనఁబడినది. (శా.శ 1072.[22])

సీ॥ దినకరకులుండైన త్రిభువనమల్లుండు
కమ్మనాండును, గుండికణ్ణుమొట్ట
వాడియుంజేకొని రూఢిగా నేలంగ
గొట్టియదోన యను పట్టణమున

మొట్టవాడి కమ్మనాఁటికి పశ్చిమమునను కన్నాటికి దక్షిణమునను నున్న ప్రాచీన సీమావిభాగములలో నొకటి.

మ ల య ము

మలయము వేంగినాఁటిలోని యంతర్భాగము. ద్రాక్షారామ శాసనములలో మలయ మండలము నేలిన చాళుక్య సామంతుల యొక్కయు, వారి మంత్రులయొక్కయు శాసనములు గలవు.

1. స్వస్తి సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సం॥ర4 శ్రీహి వేంగినాఁటి మలయ మండలమున

21. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-10. సంఖ్య-62. శాసనములో మార్షవాడ యని యున్నదిగాని తప్పొప్పుల పట్టికలో మట్టెవాడ యని దిద్దఁబడినది.

22. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-6. సంఖ్య 644.

చాళుక్య సముద్ధరుండైన సూరపరాజు"... (శా. శ.1051)

2. శ్రీమన్మహామండలేశ్వర చాళుక్యరాజ్య సముద్ధరనుండు మలయమన బంటరాజు. (శా. శ. 1065)

3. ఉత్తరాయన నిమిత్తమున మలయమున ... ... క్రొవ్విడ్డి మేడయగారి కొడుకు మాంకన పెగ్గడ" (శా. శ. 1050) సంస్కృత భాగములో నితఁడు "మలయ భూపాలస్య మంత్రీ సుధీ" అని మాంకన పెగ్గడ మలయభూపాలుని మంత్రియని వర్ణింపఁ బడెను.[23]

రాజమహేంద్రవరములోని యొకశాసనములో 'శకవర్షంబులు 1100 యుత్తరాయణసంక్రాంతి కాలమున మలయ మండలాధిపతి యైన గణపతిదేవరాజు తమ తండ్రి మహాదేవరాజుపేరు చెప్పి 'గజ్జరన మహాదేవేశ్వర శ్రీమహాదేవరను ప్రతిష్ఠచేసి యాదేవుని అంగరంగ భోగాలకు 'నందమూరు' అంగడిసుంకము ఆచంద్రార్కస్థాయిగా నిచ్చెనని గలదు. శాసనములలో పేర్కొనఁబడిన గజ్జరము, నందమూరు పడమటి గోదావరిమండలములోని నిడుదవోలు తాలూకాలోఁ గలవు. ఆతాలూకా ప్రాంతమే మలయమండలము.[24]

పై శాసనము మలయమేలిన గణపతిదేవరాజు రాజ్యకాలమున నతనిచే నొసంగఁబడిన దానశాసనము.

ఈమలయమండలమునకు మద్దూరిపురము రాజధాని.మద్దూరిపురమే ఇప్పటి నిడుదవోలుతాలూకాలోనున్న మద్దూరు. మలయావనీశులు సూర్యవంశపురాజులు. వీరు పూర్వచాళుక్య ప్రభువైన మూడవ మల్లప దేవునకు సామంతులు. ఈసామంత ప్రభువులలో నొకఁడగు మహాదేవరాజు చెంగూరినాఁటి విషయములోని 'చంద్రా

23. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-4. సంఖ్యలు 1167; 1177;1193

24. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-5 సంఖ్య-116.

వ్వూరు' అనుగ్రామమును నూటముప్పది బ్రాహ్మణులకు దానము చేసెనని శా.శ 1127 సంవత్సరమునాంటి యొకతామ్రశాసనము వల్లం దెలియుచున్నది. ఆతామ్రశాసనమునందె మలయావని గోదావరి తోయములచే స్నిగ్ధము గావింపఁబడెనని వ్రాయఁబడెను. చెంగూరు నాడె చాగల్నాడు. ఇదియె ముమ్మడినాయకుని శాసనములో పేర్కొనఁబడిన చెంగటు. చంద్రపూరు చోడవరము తాలూకాలోని చందూరు. మలయమండలము గోదావరికి ఉభయతటములందలి మన్యపుతాలూకాల పరిసరప్రాంతమై యుండెను. రాజమహేంద్ర వరము శాశనములోని మహాదేవరాజే, పైనుదాహరింపఁబడిన మహా దేవరాజు. ఇతని తండ్రి విష్ణువర్ధనుఁడు. తాత భీమరాజు.[25]

ఏఱువ భక్తిరాజు (కామరాజు) కుమారుఁడు అన్నదేవుఁడు. కీసరనాడు, వేంగినాడు, మలయము, భీమవ్రోలు, తూర్పునాడు పాలించెను. ఈనాడులన్నియు గోదావరినదికి ఉభయతటముల నున్న భూ భాగములని తెలిసికొనుచున్నాము. చాళుక్య, కాకతీయ రెడ్ల పరి పాలన కాలములోఁ బ్రసిద్ధికెక్కిన విషయములలో నిదియొకటి.

అత్తిలి విషయము

పూర్వచాళుక్య రాజన్యుల ప్రభుత్వ కాలములో అత్తిలి విష యము ప్రసిద్ధికెక్కిన నాడులలోనొకటి. అత్తిలిగ్రామము నేటి పడు మటి గోదావరి మండలములో తణుకు తాలూకాలోఁ గలదు. ఇది అత్తిలినాటికి ప్రధాన నగరము. రెండవ అమ్మరాజ విజయాదిత్యుని కలుచుంబఱ్ఱు శాసనములో, అత్తిలినాడువిషయములోని కంచుమఱ్ఱు గ్రామమును జైనాచార్యునకు దానమొసగఁబడినట్లు వ్రాయఁబడినది. కలుచుంబఱ్ఱు గ్రామమే తణుకుతాలూకాలోని కంచుమఱ్ఱు.

25. (1) ఎపిగ్రాఫి నివేదిక 1916-17. పుట 121.
(2) డిటో 1921-22. పుట 97.

ఆగ్రామ సీమావధులలో 'ఆరువిల్లి' 'కోరుకొలను' యిడి యూరు' 'యుల్లికొండమణ్డురు' అను గ్రామములు పేర్కొనఁబడినవి. అవియే నేటి ఆరవిల్లి, కోరుకొల్లు, ఈడూరు, కొమ్మర(?) అను గ్రామములు. ఈగ్రామములన్నియు అత్తిలికి సమీపమునఁ గలవు.[26]

దక్షారామ శాసనములలో నొకదానియందు భీమేశ్వరునకు అత్తివిషయములోని "విప్పఱుతం" బెట్టిన పొలము ఖండు కలు మూఁడు దానమొసగఁ బడినట్లు గలదు. ఈ విప్పఱ్ఱు తణుకు తాలూకాలో తూర్పు "విప్పఱ్ఱు అను గ్రామమే.[27]

కొసలనాడు

ఆంధ్ర బ్రాహ్మణులలో వివిధ శాఖల వారిలో కాసలనాటి వారొకరు. కాసలనాటి బ్రాహ్మణులే కాసలనాటి వారు. కాసల నాటిని తెలుపు ప్రథమాంధ్రకావ్యము వినుకొండవల్లభరాయ కృత క్రీడాభిరామము. కాసలనాటి మాధవుని కుమారుఁడును, మీసాల అప్పయగారి మేనల్లుఁడునగు గోవింద మంచన శర్మయు నతని స్నేహి తుఁడైన టిట్టిభసెట్టియు ఓరుగల్లు (వరంగలు) ప్రవేశించి, యచ్చటి వింతలు తిలకించి, రాత్రి భాగమున కామోప భోగము ననుభవిం చుట, యాకావ్యకథావస్తువు. శ్రీనాథుని చాటువులలో కాసలనాటి కాంతల వర్ణనయుఁ గలదు. వానిని గ్రోడీకరింతును.

"ఏకశిలానగరంబునందార్య వాటంబునం గామమంజరి యను పునర్భువునందు బద్ధానురాగుండై, కార్యాంతరవ్యాసంగంబున దేశాంతర గతుండైన కాసల్నాటి గోవింద మంచనశర్మ"

క. కాసల్నాటి శ్రేష్ఠుడు
మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు ధా

26. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-7. సంఖ్య-25
27. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-4 సంఖ్య 1163

శ్రీసుర తిలకుఁడు కుసుమ శ
రాసన సముఁడాంధ్ర నగరయోత్రోన్ముఖుఁడై
ప్ర॥ "ఎందుండివచ్చితిరు ? కాసల్నాటి
నుండి వచ్చితిమి మేముత్పలాక్షి."

ఉ॥ వీసపు ముక్కు నత్తును నరవిసపుమంగళ సూత్రమమ్మినన్
గాసును రాని కమ్మలర కాసును రానివి పచ్చపూసలున్
మాసిన చీరగట్టి యవమానమెసంగఁగ నేఁడు రాఁగనా
కాసలనాటి వారి కన కాంగిని జూచితి నీళ్ళరేవునన్

గోలకొండ దుర్గాధ్యక్షుఁడును, గోలకొండరాజ్య ప్రభువగు మలికిభరాముని తాలూకుదారైన అమీనుఖానునకు పొన్నిగంటి తెలగనార్యుఁడు కృతినిచ్చుచు నతఁడేలు పొట్ల చెరువను గ్రామము కాసలనాటి లోనిదని యిట్లు వర్ణించెను.

ఉ॥ తామర తంపరై సిరులఁ దార్కొను కాసలనాఁడు సత్యచిం
తామణి పొట్లచెర్లను నతంబగుచుండ నమీనుఖానుఁడిం
పామతిలంగ నిల్పెఁ బొడవై బెడఁగైన మసీదుఁ గాంచియం
దేమను వెండికొండపయి కేఁగఁ దలంపక భేసికంటిముక్

ఈ పొట్లచెరువు గ్రామము తెలంగాణములోని మెదకు జిల్లా పంగారెడ్డి తాలూకా యందలి గ్రామము. శ్రీశైల మల్లికార్జుని శాసనములో ఈ కాసల్ల నాటికే కుసల్నాడని వ్రాయఁబడినది. ఆకు పలనాటిలోని 'కలుచెఱులు' 'సాసుజ్జల' 'దేవరపల్లి' యను గ్రామములు కరీంనగరము జిల్లాల్లోని సుల్తానాబాదు తాలూకాలోని కలవ చెర్లయు, సిరిసిల్లి తాలూకాలోని సిరిసిల్ల దేవరపల్లి యను గ్రామములు. అవఁగాఁ కాసలనాడనునది తెలంగాణములోని హైదరాబాదు వరంగలు జిల్లాల కుత్తర ప్రాంతమని చెప్పవచ్చును. నాకు లభించిన యాధారముల ననుసరించి యింతకన్న ప్రస్తుతము ఎక్కువ వివ

ములు వ్రాయుటకు వీలులేకపోయెను. భావిపరిశోధనవల్ల వివరములు తెలుపుచున్నాను.

పెనుగొండ—ఘనగిరి—రొద్దనాడు

పెనుగొండ ఆంధ్రదేశ చరిత్రలో ప్రసిద్ధికెక్కిన గిరిదుర్గములలో నొకటి. అనంతపురము మండలములో పెనుగొండ తాలూకాకు ప్రధాన నగరము. శాసనములలోను సారస్వతములోను పెక్కుసారులు ప్రశంసింపఁబడినది. ముఖ్యముగా విజయనగర సామ్రాజ్య చరిత్రలో వాసికెక్కిన దుర్గము. విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట తిరుమలదేవరాయలు తన రాజధానిని పెనుగొండకు మార్చి, రామరాజు భూషణునిచే వసుచరిత్ర కృతినందెను. చరిత్రకు, సారస్వతమునకు పుణ్యతీర్థము. పెనుగొండకు ఘనాద్రియని సంస్కృతనామము. విజయనగరసామ్రాజ్యాధీనుల కాలములో ఈ పెనుగొండరాజ్యము అనంతపురము మండలములోని పెనుగొండ మడకసిర, అనంతపురము గుత్తి తాలూకాల ప్రాంతము వఱకు వ్యాపించియుండెను.

1. "ఘనాద్రిరాజ్య సంబంధ గుత్తివళిత మధ్యగం చిందమ్మాన కటీతి విఖ్యాతమష్టభోగ సమన్వితం"
2. పెనుగొండ మహారాజ్యే రోదగ్రామస్య సీమని లేపాక్షివీర భద్రాది దేవతోత్సవసిద్ధయే॥ అచ్యుతేంద్ర మహారాయేణార్పితస్య స్వనామతః। గ్రామస్య మోదయాఖ్యస్య స్థలేయత్నేన నిర్మితా.
3. పెనుగొండ రాజ్య రోదనాడ గుయ్యలూర సీమపూళ గణగొరవన హళ్ళి.
4. ఘనగిర్యాహ్వయే రాజ్యే ప్రాచ్యేవాసము పాసితం రొద్దనాడు వరాంతస్థం ప్రాచ్యాం శ్రీతోట హళ్ళితః। పశ్చిమాంతే కులోడస్య మీనకుంటాగ్రహారతః।

5. మారటూరాకసేసుయ రొడ్డనోడూళ గణ ఉపుడిహాళియణ శ్రీ వీరకృష్ణమహారాయరిగె.

6. శ్రీమన్మహామండలేశ్వర మంగరసనురొడ్డ మూనూఱు కణియ కల్లు మూరూఱుం అన్తు ఎరడుఱునూఱుం సుఖసంకథావినో దదం. పై శాసనోదాహరణములువల్ల పెనుగొండరాజ్యములో రొడ్డనాడు కలదనియు, రొడ్డనాడు మున్నూరు గ్రామములు కలవనియు, తెలియుచున్నది. రొడ్డము అనంతపురము మండల ములో పెనుగొండ తాలూకాలో పెన్నానదీ తీరముననున్నది. ఆయా శాసనములలో నుదహరింపఁబడిన గ్రామములు, వాని ప్రస్తుత స్థితియు నీదిగువ సూచించుచున్నాను. రొడ్డనాడు వ్యాప్తియుఁ దెలియ గలదు.

| | | | |
|---|---|---|---|
| 1. | చిమ్మనకటి | తిమ్మనచెఱువు | గుత్తి తాలూకా |
| 2. | లేపాక్షి | లేపాక్షి | హిందుపురము తాలూకా |
| 3. | మోద | మోద | డిటో |
| 4. | గోరవనహాళ్ళి | కొడిగెనహాళ్ళి | డిటో |
| 5. | ఉపుడిహాళ్ళి | ఉప్పారహాళ్ళి | మడకసిర తాలూకా |

పై నుదాహరింపబడిన శాసనములు పెక్కులు విజయనగర సామ్రాజ్య మేలిన కృష్ణదేవరాయల, అచ్యుత దేవరాయల నాటి కన్నడ శిలాశాసనములు.[28]

## ఆంధ్రపథము

దక్షిణాపథములోని యంతర్భాగమే ఆంధ్రపథము. పథమనగా దేశవిభాగము. ఆంధ్రపథమన్నను, ఆంధ్రదేశమన్న నొక్కటియే.

28. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-9. ప్రథమ సంపుటము. సంఖ్య 146; ద్వితీయ సంపుటము సంఖ్యలు 482, 535. 577. 582, 583—

పల్లవయువ మహారాజైన శివస్కంధవర్మ కాంచీపురమునుండి ప్రకటించిన మైదవోలు ప్రాకృత శాసనములో ఆంధ్రపథములోని విరిపు యను గ్రామమును పూర్వకుమార్యుడు, గోనందార్యుడను నిరువురు బ్రాహ్మణులకు దానముచేసినట్లు ధాన్యకటకము(ధరణికోట)లోనున్న తన వ్యాపృతునకాజ్ఞ నిచ్చెను. ఆశాసనములో "అన్ధాపతీయగామో విరిపరమ్" అని ప్రాకృతములో వ్రాయఁబడినది. ఈ విరిపరయే సత్తెనపల్లి తాలూకాలోని విప్పర్లయను గ్రామము. ధరణికోటయు సత్తెనపల్లితాలూకాలోఁ గలదు.[29]

బాణరాజుల శాసనములో ఆంధ్రపథము పేర్కొనఁబడినది. బాణరాజులు ఆంధ్రపథమునకు పశ్చిమముననున్న దేశము నేలుచుండిరని వారి శాసనములలో వ్రాసికొనియున్నారు. బాణరాజులలో నత్యంతపూర్వుడైన జయనందివర్మ యేలిన రాజ్యము 'ఆంధ్రాత్ పథః పశ్చిమతో క్షితిః" యని బాణరాజైన రెండవ విక్రమాదిత్యుని ఉదయేంద్రియము తామ్రశాసనములో పేర్కొనఁబడినది.[30]

"సతిస్మ క్షితి మేకవీర ఆంధ్రాత్పథః పశ్చిమతో బలీయాన్
వసూమదన్యసమామ్ కులోత్థామ్ రాజన్యచూడామణి రంజితాంఘ్రిః

ఆంధ్రపథ మాంధ్రదేశమునకు పర్యాయపదముగా శాసనములందు వ్రాయఁబడియున్నది.

## వడుగావళి

తమిళ, కన్నడశాసనములలో ఆంధ్రదేశమునకు వడుగావళి—వడుకావళియను పేరు ఉపయోగింపఁబడినది. ద్రవిడదేశకుత్తరప్రాంతమునకు వడుగుభూమియనియు, వడుకావళియనియు పేర్లు. కన్నడ భాషలో వడుగావళి పన్నిసాశిరమని (వడుగావళి పండ్రెండు వేల

29. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-6. పుట 85-88.

30. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-3. సంఖ్య-13.

గ్రామములుకలది) పాకనాటిరునదివేలు, వేంగీసహస్రగ్రామము, అని గ్రామముల లెక్కనుబట్టి ఆయానాడులు పిలువఁబడినట్లే, వడుగావళియుఁ జెప్పఁబడినది. గుడిమల్లములోని బాణరాజుల శాసనములైదింటిలోఁ గొన్నిటియందు వడుగావళి యుదాహరింపఁ బడినది. చిత్తూరుమండలములోని పుంగనూరు బాణరాజు కన్నడశాసనములోఁ వడుగవళి పన్నిసాసి అమని' గలదు. విజయనంది విక్రమవర్మ తిరువల్లము తమిళశాసనములో బాణరాజులేలు రాజ్యభాగమునకు 'వడుగావళి' పంట్రెండువేలు అనియే తెలుపఁబడినది. ఆంధ్రమండలము, ఆంధ్రపథము, వడుగావళి పన్నిసాసిరము, అన్నను, నేటి కృష్ణానదీ దక్షిణ ఆంధ్రప్రదేశమునకు సరివచ్చును.[31]

ఆంధ్ర సాహిత్యపరిషత్తు రజతోత్సవసంచికలోఁ గీర్తిశేషులైన శ్రీకృష్ణస్వామి అయ్యంగారు ఆంగ్లభాషలో 'వడుకు-వడుకర్' అను విషయమునుగూర్చి వ్రాసినవ్యాసములో 'వడుకావళిని'గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"శాసనములలో తమిళఆంధ్రదేశసరిహద్దులను గూర్చి వడుకావళి మేఱ్కు (పడమట) వడుకావళి కిళక్కు (తూర్పు) అను రెండు

31. (1) బాణుల గుడి మల్లము శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము-11. పుటలు 230-231.
(2) విజయ నంది విక్రమవర్మ తమిళశాసనము. దక్షిణ హిందూదేశ శాసనము-3. పుట 90.
(3) పుంగనూరు శాసనము. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము-9 సంఖ్య
(4) అదియునుగాక ముడియానూరు తామ్రశాసనములో (క్రీ. శ.338) ఈవడు గావళి పంట్రెండువేలు ఆంధ్రమండల ద్వాదశ సహస్రగ్రామ కలితమని చెప్పఁబడినది.
ఇండియన్ ఆంటిక్వేరి సంపుటము-15. పుట 175.

పథములు చెప్పఁబడినవి. పెరియ పురాణములో మధురపై దండెత్తిన యొకరాజునుగూర్చి వడుక కర్ణాటక రాజని వ్రాయఁబడినది. అదే విధమున హొయిసలరాజుల శాసనములలో దక్షిణదేశపు దాడికి పెరియవడుక కలహమని కలదు. కావున తమిళదేశస్థులకు వడుకలనిన కన్నడులనియే భావము. తర్వాత నేటికాలమునను వడుకవారనగా తెలుగువారనియు, వారిభాషకు వడుకభాషయనియు వ్యవహారసిద్ధమయ్యెను.''

వడుగావళి పండ్రెండు వేలనినను, ఆంధ్రమండల సహస్ర గ్రామములన్నను ఒక్కటియే. ఇదివఱకు సూచించినట్లు ఇప్పటి ఆంధ్ర ప్రదేశములోని కృష్ణానదికి దక్షిణముననున్న ఆంధ్ర మండలములకు సరివచ్చు భూభాగమునకే పూర్వము వడుగావళి యని పేరు.

## రాజ్యములు. ఉదయగిరి రాజ్యము

విజయనగర సామ్రాజ్యకాలములో దేశము వివిధరాజ్య భాగములుగ విభజింపబడి ఆ యా రాజ్యములు మంత్రుల పరిపాలనమునందుగాని, యువరాజుల పరిపాలనమునందుగాని నియుక్తములయ్యెను. హరిహరరాయల సోదరుడైన కంపరాయలు ఉదయగిరి రాజ్యపాలకుడుగ నియమింపబడెను.[32] ఉదయగిరి రాజ్యమునకు ఉదయగిరి రాజధాని. ఇది నెల్లూరు మండలములోని ప్రసిద్ధమైన గిరిదుర్గము. నెల్లూరు మండల ఉదయగిరి శాసనములలో ఉదయగిరి రాజ్యమునందలి యీక్రింది గ్రామములు పేర్కొనబడినది.

| | | |
|---|---|---|
| ఉదయగిరి | కందుకూరు | సరియపల్లె |
| నెల్లూరు | పొదిలె | కలిగిరి |
| కొరటూరు | కొండవలూరు | కెగిప |

32 ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 3. పుట 114.

| | |
|---|---|
| గండవరం | అల్లూరు |
| దువ్వూరు | కోవ్వూరు |
| ఆతుకూరు | వవ్వేరు |
| జలదంకి | ప్రభాకర పట్టణము |
| రాపూరు | కృష్ణరాయపట్టణము |

ఈగ్రామములన్నియు నేటి నెల్లూరు మండలములోని నెల్లూరు, కోవ్వూరు, పొదిలె, కందుకూరు, ఉదయగిరి తాలూకాలో గలవు.[33] కొంచెమెచ్చుతగ్గుగ ఉదయగిరిరాజ్యము నెల్లూరు మండలమునకు సరివచ్చు రాజ్యభాగము. ఈఉదయగిరినే సాళువ నరసింహరాయలు, కృష్ణదేవరాయలు సాధించిరి.

## కొండవీటి రాజ్యము

కొండవీడు గుంటూరు మండలములోని ప్రశస్తిగాంచిన గిరిదుర్గములలో నొకటి. విజయనగరసామ్రాజ్యములో ఉదయగిరి రాజ్యముతో సమానముగ చరిత్ర ప్రసిద్ధిని జెందినది. ఈ గిరిదుర్గమును కృష్ణదేవరాయలు సాధించినతర్వాత సాళువ తిమ్మరుసుమంత్రియు, నతని భాగినేయులైన అప్పన, గోపదండనాథులును గొండవీటి రాజ్యమును పాలించిరి. కృష్ణదేవరాయల కాలమునాటి బాపట్ల గ్రామము కొండవీడు విషయములోనిదని చెప్పబడినది.

శ్రీకృష్ణవేణ్యాం భసిః...సంప్రతి కొండవీడు విషయే బాపట్ల సంజ్ఞేపురే.[34] అనగా కొండవీడురాజ్యము నేటి గుంటూరు మండలము తూర్పుప్రాంతమునకు సరివచ్చునని చెప్పవచ్చును.

## చంద్రగిరి రాజ్యము

చంద్రగిరి చిత్తూరు మండలములో తిరుపతికి సమీపముననున్న

33 నెల్లూరు మండల శాసనసంపుటములు ఉదయగిరి (21)

34. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 6 సంఖ్య 146

యొకదుర్గము. ఇచ్చటనే అచ్యుతదేవరాయలు పట్టాభిషిక్తుడయ్యెను. చంద్రగిరిరాజ్యము నేటి చిత్తూరు మండలమునకు సరివచ్చును.

గుత్తిరాజ్యము

శ్రీ వీరనరసింహరాయలనాటి తాడిపత్రి గ్రామములోని శాసనములలో గుత్తిరాజ్యము పేర్కొనబడినది.

1. శ్రీ వీరనరసింహ్వ మహారాయలు విజయనగరమందు పృథివీ రాజ్యం శేస్తుండగాను తత్పాదపద్మారాధకులైన శ్రీమన్మహా ప్రధాన సాళువ తింమ్మయ్యంగారు గుత్తిరాజ్యంలోను పెంన్మబడి తాడిపరతి రామేశ్వరదేవరకు దండంవెటి మాకు నాయంకరమై చెల్లేటి గుత్తి రాజ్యంలోని పెంన్నబడి స్థళంలోను నెలదలపాడు అనేటి గ్రామానకు

2. శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర, శ్రీ వీరప్రతాప శ్రీ వీరనరసింహ్వరాయ మహారాయలు పాలించి మాకు నాయంక్రమై చెల్లేటి గుత్తిరాజ్యంలోనున్న అందుకు గుత్తి శ్రీమనున్న, పెంన్మబడి శీమనుంన్న[35]

పై శాసనములో పేర్కొనబడిన నెలదలపాడు గ్రామము తాడిపత్రి తాలూకాలోని నందలపాడను గ్రామమె. గుత్తిరాజ్యములేక సీమ నేటి గుత్తి, తాడిపత్రి తాలూకా ప్రాంతము. రాజ్యము, సీమ పర్యాయపదములుగ పై శాసనములో వాడబడియుండెను.

(సశేషము)

35. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 4 సంఖ్యలు 802-803.

# గ్రంథస్వీకారము–సమీక్ష

(బాజారు తమ్మయ్య)

1. "సుధర్మ" కర్త శ్రీ భట్టారం మల్లిశాస్త్రనకవిగారు, నెల్లూరు ప్రెసు. పుటలు 55+8 వెల రు 1—8—0.

ఇదియొక వినూత్న స్వతంత్రపద్యకృతి; సుధర్మ యనఁగా మహేంద్రుని స్వర్గసభ పేరు. దానినే కవిగారు కృతినామముగా గ్రహించినారు. కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, గ్రంథము తొలిపలుకులో సూచించినట్లు నేఁడు మానవులు చంద్రగ్రహము వైపునకుఁ బంపెడి రాకెట్టులజూచి దేవతలు భయపడుట, మానవులకు దేవతలకు రాఁబోవు కయ్యమును భావించుట– దానికిఁ గలహభోజనుఁడయిన నారదుని యుబలాటము–బృహస్పతి మందలింపు- చివరకు నారదుఁడు శాంతిదూతగా మారి నేఁటి పాశ్చాత్య నాగరక యువకవేషమును దాల్చి భూలోకమునకుఁ బయనించుట–ఇత్యాదిగా ఆధునికవస్తు సంగ్రహణ విలసితమయినది యిందలి కథావస్తువు. రచన శ్రీనాథాది పూర్వ మహాకవుల ప్రౌఢమార్గముననే, మృదు మధురమగు సంస్కృతాంధ్రపదసమ్మేళనముతో హృదయాహ్లాదకరముగ నాద్యంతముకొనసాగినది. మొదటి ముప్పదియారు పద్యములలో ఇంద్రుని రాగభోగములు, శచీదేవితోడి శయ్యామందిర విలాసక్రీడలు మనోహరముగ వర్ణితములయినవి. రాకెట్టు ప్రేలుడులవలన నిద్రాభంగమయి శచీపురందరులాందోళిత హృదయులయి వెలువరించిన భయవిహ్వలతలతోఁ ససు నాటికకు ప్రారంభమగును. మానవులు రాకెట్టులోఁ దాము స్వయముగా బయలుదేరినట్లు ధైర్యసాహసములు లేక ప్రాణములమీఁది తీపిచే సంగసు వెనుకాడి యే కుక్కలనో, కోఁతులనో యానములోఁ బెట్టి పంపుటయందలి శాలీనతనుగూడ దేవతలు కేలియొనరింతురు. ఇట్టి నూత్నవిషయములను గ్రహించి కూర్పఁబడిన క్రొంగొత్త కబ్బమవుటచే బలువురు దీనిని బ్రశంసించిరి. విశ్వనాథవారి తొలిపలుకులోని

ప్రశంసలేగాక. శ్రీ మోచర్ల రామకృష్ణయ్య, కాటూరి వేంకటేశ్వర రావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, పి. వి. రాజమన్నారు, లోక్ సభస్పీకరు, శ్రీ ఎమ్. అనంతశయనము అయ్యంగారు మున్నగు పెద్దలనుగ్రహించిన సదభిప్రాయములు, శుభాశీర్వాదములు గ్రంథారంభమున ముద్రింపఁబడినవి.

మచ్చునకుఁ గొన్ని పద్యములు.

క. కుచ్చెళ్ళెగసిన గాగగ।విచ్చిన యుమ్మెత్తపూవువితమున నొంతో
ముచ్చటగొలుపంగాన।య్యచ్చర మేల్బంతి నాట్యమాడెను సభలోన్

శా. అత్యంతీనులహమ్మతుల్ మనుజులత్యర్థప్రయత్నంబుతోఁ
బ్రత్యూహంబులు చూపుచూపుకొనుచున్ బ్రాలేయరుఙ్మండల
ప్రత్యాశామతులై భయంకరముగా రాకెట్లలో వచ్చుటల్
ప్రత్యక్షంబుగఁ జూచివచ్చితినిద్యావాభూమిమధ్యంబునన్

శా. కండల్ క్రొవ్వి నరాధముల్ దివికి సంగ్రామార్థులై వచ్చి రేని
ముండంబుల్ తెగఁగొట్టి తుండముల నంభోభృత్సృతిన్ గాంచ ఛే
రుండోదగ్ర నఖాగ్ర లగ్నములుగా ఉన్నాగ లేకున్న నీ
దండం బేటికిఁ బాశమేటికిఁ గృతాంతఖ్యాతి నాకేటికిన్.

కవిగారు ప్రస్తావనలో "తప్పులుండు నెడ సౌహార్దంబునన్ నాకు తెల్పి నను దీరిచి దిద్దుఁడయ్య" అని ప్రార్థించినారు. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు "వెదకితే అచ్చుతప్పు కానవస్తుందేమో గాని వ్యర్థపదము గానరాదు". అని తమ సదభిప్రాయములో వెల్లడించి నారు. ఎంత వెదకినను నీకృతి యందచ్చుతప్పులును గానరావు. ముద్రణము కూడ నిర్దుష్టముగా నున్నది. అత్యంతీనులు, శుభంయువుల్. మున్నగు ప్రయోగములు కవి పోషితరుఁ దార్కాణములు. కాని "రక్కసుల యుక్కమీఱిన రాణువాలు" అను176పద్యమందలి గీతగీచిన పదము సంస్కారార మని మా యభిప్రాయము. రాణువనఁబడు అనాగాన

నయిన దేశ్యము. మువర్ణాంతముగాదు. కాన తద్బహువచనరూపము "రాణువలు" అనియుండుటయే యొప్పినము. నవికి భవ్యమగు భవిష్యము నభ్యుదయము నాకాంక్షించుచున్నాము. ఇతోధిక హృద్యతర రచనములచే నాతఁడాంధ్రి నలరించుఁగాత! 2. <u>తిక్కనచరిత్రము:-</u> రచయిత శ్రీ శిష్ట్లా బాల కోటీశ్వరరావు గారు బోడసకుర్రు గ్రామము. పుటలు 66+16. వెల రు 1-0-0. పద్యకృతి. అయిదుల్లాసములుగ రచితము. నెల్లూరు మనుమసిద్ధిరాజు దండనాథుడయిన ఖడ్గ (రణ) తిక్కనచరితమిది. పసువులబీళ్ళను పుల్లరి చెల్లించుపద్ధతిని మనుమసిద్ధినొద్ద నుత్తకుఁగొని కనిగిరిసీమనేలు యాదవరాజు కాటముఁడు పుల్లరిసొమ్ము నెగవేయుటవలనఁబొసఁగిన పోరాటములో రణతిక్కన యవక్రవిక్రమస్ఫురణము నెఱపియు దైవికముగ నిహతుఁడయిన సుప్రసిద్ధ కథావస్తువునుగొనియే యీకృతి రచింపఁబడినది. పేరూరు జమీందారు శ్రీ జిల్లేళ్ళ భానోజీరామన్న గారి కంకితముయినది. రణరంగమున జయలక్ష్మి యాసన్నముకానున్నతఱి తిక్కనపయి నీసుచే సేనానాయకులు కొందఱు శైవ వైష్ణవవిద్వేష సూచితభావములు కారణముగా సేనలతో రణభూమినుండి వెడలి విగ్రహ మొనరించుటం జేసి తిక్కన నిస్సహాయుఁడయి పరాజయముతో మొదటిసారి యింటికి మరలెననియు నప్పుడు తల్లియు, భార్యయు నాడిన నిష్ఠురవాక్యములకు ఖిన్నుఁడయి మరల రణమునకేఁగి మరణమొందెననియు నిందలి చారిత్రిక విషయము.

"ఓటమి నొంది యిలుసేరిన రణతిక్కనకు స్నానార్థమై పసుపు ముద్దతో నులకమంచమును భార్యచానమ్మ ప్రదర్శించుట. ఆ సందర్భములో నొండు రెండు చాటుపద్యములు వెలసి, తెలుఁగువారి నోళ్ళలోఁ బెగ నానియున్నవి. అవి యీతఁ డెత్తుకొనలేదు. ఎత్తుకొనకపోవుట ఆంధ్ర విప్రసతీత్వమునకు న్యాయము చేయుటయే

యగుచున్నది." అని గ్రంథమునకుఁ దాము వ్రాసిన మున్నుడిలో శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు సెలవిచ్చినారు. శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారు కూడఁ దమ యభిప్రాయములో నిందలి ఔచిత్యమును బ్రశంసించినారు. ఒక్క భార్యయే కాదు. కన్న తల్లికూడ నాసందర్భమునఁ దిక్కన్నను బరిహసించి రోసమెక్కించి నది. చాటువులలోని "ముగురాడువారె మైతిమి" అను వాక్యము చిరవిశ్రుతము. వాస్తవముగ జరిగిన యీ వృత్త మానాటి వీరవని తల వీరత్వమున కాదర్శకము. వారి వంశమర్యాదకు స్ఫోరకము. దానిని గవిగారు లోపింపఁజేయుట మాకంత సమంజసముగఁ గానిపించు లేదు. సేనాపతులు తమ యకృత్యమునకుఁ బరితప్తులయి రెండవ సారి కవితిక్కనతోఁగూడి ఖడ్గతిక్కనకు సాయముగ రణరంగము నలంకరించి విజయమునకుఁ దోడ్పడిరనియుఁ గాని యువ్వెత్తుగ వెనుక పాటున వచ్చిపడిన బాణహతిచే రణతిక్కన నేలఁగూలెననియు, శత్రు సంహారమొనర్చి కవితిక్కన రణతిక్కన మృతకళేబరమును నెల్లూరికిఁ దీసికొనివచ్చి యంత్యక్రియ లొనర్చెననియు, ఈ రణసందర్భమున మొదట సేనానాయకులలో వెలసిన పరస్పరవిద్వేషముల మనసున నిడుకొనియో తత్పరిహారార్థముగ నద్వైతమతస్థాపకముగ హరిహర నాథాంకితముగఁ దిక్కనమంత్రి భారతరచనమున కుపక్రమించెనని కవిగారు సూచించి తిక్కన కృతిరచనమును సమర్థించిరి. ఈప్ర శముగ నీకృతిరచనములో స్వల్పముగఁ గొన్నిమార్పులు కవిగారొన రించినారు. ఏది యెటులున్నను గథానాయకుని రణనిహతి దైవఘటి తము. అది యాతని యపరాక్రమమునకుఁ గళంకము కానేరదు.

"మొగమోటము విడిచెప్పవలసినచో కావ్యము సుఖాంత మయినను, దుఃఖాంతమయినను, ఈయుపసంహారము బింకముగా లేదు. ముగింపులో నొకసారి ఖడ్గతిక్కన విక్రమరూపము కనఁబడఁజేసియుల

యును. ఘనుమసిద్ధి ఈకావ్యములో మందకొడిగా నుండుటయు దగినదికాదు. ఇదియంతయు గ్రంథాజీవితమునకు సంబాధించినది” అని శ్రీ సత్యనారాయణగారు తొలిపలుకులో వెల్లడించిన నిష్పాక్షికాభిప్రాయముతో మేము నేకీభవించుచున్నారము– గ్రంథరచన మాద్యంతము ధారావాహియయి మృదుమధుర శైలికీతులలోఁ గొనసాగినది. ఇంటర్మీడియేటు పరీక్షకుఁ జదువుచున్న పదునాఱవయేటఁ గవిదీనిని రచించెనఁట. తగిన ప్రతిభావ్యుత్పత్తులను జిన్ననాఁటనే యలరించికొని దీనినాతఁడు రచించుట ముదావహము. పండితప్రకాండులు,విద్వత్కవులు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రికవిసార్వభౌములు, శ్రీ బులుసు అప్పన్నశాస్త్రి వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, కొల్లి అనంతపద్మనాభశాస్త్రి, వక్కలంక లక్ష్మీపతిరావు ప్రభృతు లొసంగిన సదభిప్రాయములు గ్రంథమున ముద్రితము లయినవి. ప్రథమ ప్రయత్నమయినను గవి దీనిని సమర్థముగ నిర్వహించినందు కభినందించుచు సతోధికాభివృద్ధి నభిలషించుచున్నాము.

మచ్చునకుఁ గొన్ని పద్యములు :

ఉ॥ కలకుంచెనమ్మ నుక్కినరుఁ గాటమరాజున యాపుదాల్చె నే
వెలపెలుఁగండు ఘూర్ణుఁడును వీరవరేణ్యుఁడతండు, నిక్కు వం
బులిదివెలుంగ కేయరుల నొంపగఁ దూఁకును మందబుద్ధియై
యలవలసేయు నార్జవము నల్పుఁడుక్రిందును మీఁదెలుంగమిన్
(ఆ1 ప66)

శా॥ మూపుంబుప్పులు నాలుకాయులుగ నామోహంబుతో నాపసుల్
చూడన్ ముచ్చటగొల్పుచున్ బెరిగె నచ్చోఁగాలమున్ మాటెదా
రా వెన్ మేఘము లంబరమ్మునసదా యయ్యాదవ క్షోణిలో
నేపుంగాంచిన గొల్లవారి చెలునవ్వేచించె శుంభద్గతిన్ (ఆ2ప44)

ఉ॥ పావనశారదోదయము భాసిలెఁ బొంపుర నీరదాం
లస న్మనోజ్ఞతర శీతలదృశ్యము హృద్యకుజాళితా
రావవిలాసమై సురుచిర ప్రసవోత్కర సౌరభప్రీఁ
బై విమలాంబుపూరమయి హాసపువెల్లువు లిండఁ జేయుచున్.

(అ3 ప2)

శకటరేఫయుతశబ్దములు చాలవఱకులఘురేఫయుతములుగాఁ బలుతావులనిందుఁ బ్రదర్శింపఁబడుట శోచనీయము. చతుర్థాశ్వాసము 34వ పద్యము మహాస్రగ్ధరలో రెండవపాదమున "నారతి దర్పాభీలురై సింగపుగొదమలు నానవ్యోడన్ నిల్చిపోరన్" అను చోటఁ బ్రమాదపతితముగ రెండవయతి తప్పినది. "సింగపు" అనుటకు మాఱు "సింహపు" అని మార్పఁదగును.

3. తత్సమ శతకము క్రౌనుపుటలు 24 వెల 0-6-0.
4. రూపాంతర శతకము ,, , 24 వెల 0-6-0.

కర్త:-శ్రీ విద్వాన్ కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు, నివృత్తప్రధానాంధ్రోపాధ్యాయులు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా. ఇవి శతక వాఙ్మయమును శాస్త్రనిరూపకముగఁ గూడ విస్తృతమొనర్చు నుద్దేశముతో నూత్నమార్గమున రచితములైనవి. ప్రకృతివికృతులయు శబ్దరూపాంతరములయు విజ్ఞానము నేఁటి యున్నతపాఠశాలా విద్యార్థుల యాంధ్రపాఠ్య ప్రణాలికలోఁ జేరియున్నసంగతి సర్వవిదితము. ధారణాసౌలభ్యముతో నట్టి విజ్ఞానమును విద్యార్థిలోకమార్జించుట కిట్టి శతకములు మిక్కిలి యుపకరించును. ఇందుకై కృతికర్త సల్పిన కృషి నభినందించుచున్నాము. మచ్చునకుఁ గొన్నిపద్యములు.

క. అచ్చెరువున కాశ్చర్యము
అచ్చెరియంబునకుఁ బ్రకృతి యాశ్చర్యంబౌ
నచ్చమునకు నచ్ఛమగును
అచ్చరకుం దత్సమపద మప్సర యయ్యెన్

క. దూలికిఁ గూఁకి ప్రకృతియగుఁ
గేలికిఁ దత్సమపదంబు కేళియగుంగా
గాలవకుఁ గుల్య ప్రకృతగుఁ
గాలియనుందత్సమంబు గాళికయయ్యెన్.

క. తూనీఁగకుఁ దూనిఁగయగుఁ దేనెకు రూపాంతరంబు తేనియయయ్యెన్
దేనుపునకుఁ దేన్పయ్యెన్ గానుపునకు వేఱురూపు గాన్పనిరిబుధుల్.

క. వేలునకు రూపువ్రేలగు వేలమునకు వేఱురూపు వేడంబయ్యెన్
వేలిమిరూపము వేల్మగు వేలుపునకు వేఱురూపు వేల్పనిరిబుధుల్

5. తణుకు పంచాయితీ సావనీరు:-డబుల్ క్రౌను పుటలు 170.
ప్రకాశకులు:-తణుకు పంచాయతీ, తణుకు. పశ్చిమగోదావరిజిల్లా
వెల తెలియదు.

తణుకులో పంచాయతీబోర్డు స్థాపితమయిన 1891 సంవత్సరము నుండి నేటికి డెబ్బదిసంవత్సరములు గడచినవి. సప్తతినెట్టిన యీసంస్థయొక్క చరిత్రమును స్మరింపఁజేయుటకయి యీ సంచిక 1960 డిసెం. రు నెలలో విశేషవ్యయ ప్రయాసములతో బహుసుందరముగఁ బ్రకటితమయినది. ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య 24-12-60 తేదీనిదీనిని ఆవిష్కరించిరి శ్రీ ముళ్ళపూడి వేంకటరాయఁడుగారి కుమారులు తిమ్మరాజుగారు, ఈపంచాయితీకిఁ బెక్కు సంవత్సరములు అధ్యక్షులుగానుండి బహువిధముల దానియభివృద్ధికై పాటుపడినారు. ప్రస్తుతము రెండేండ్లనుండి వారి కుమారులు శ్రీ హరిశ్చంద్ర ప్రసాదు (ఎం. ఎల్. ఎ) గారు అధ్యక్షులుగానున్నారు. పంచాయితీ సభ్యులకోర్కెపయి నీతండ్రికొడుకుల యాదరణముచే వారి యాధ్వర్యమున నే తణుకునందలి స్వకీయ రాయల ముద్రణాలయమున నివి యత్యంత సుందరముగ మంచి కాగితములపయి ముద్రింపఁబడినవి. ఆంధ్రదేశమందలిపంచాయతీలగూర్చిన ప్రచురణములలో

నిది ప్రాథమికముఁ బ్రముఖమునని భావింపఁదగును. బహువిషయకములయిన వ్యాసములతోపాటు, కడచిన డెబ్బదియేండ్లలోను పంచాయతీ అధ్యక్షులుగా, ప్రముఖసభ్యులుగానుండిన పలువురు వ్యక్తులయు, పంచాయితీల పరిపాలనమునకు సంబంధించిన పలువురు రాష్ట్రప్రభుత్వోద్యోగులయు, ఇతరప్రముఖులయు, పట్టణమందలి దేవాలయములయు, సంస్థలయు, చిత్రపటములుగూడ నిందు బ్రకటితములయి గ్రంథమున కెనలేని రామణీయకము నాపాదించుచున్నవి.

పశ్చిమ గోదావరిజిల్లాలోని పురాతన పట్టణములలో తణుకొకటి. ఆపేరిటి తాలూకాకది ముఖ్యపట్టణము. పవిత్రమైన గోస్తనినది యీపట్టణమధ్యమున ముత్యాల కంఠమాలవలెఁ బ్రవహించుటచే ననాదినుండియు నీపురవరము ప్రకృతిపరిశోభకు, ఆరోగ్యదాయకమగు మనోజ్ఞవాతావరణమునకుఁ బేరుగాంచియున్నది. నేఁడు ముళ్ళపూడివారి కృషిమూలమున బహువిధములఁ బురోగమించి విద్యాభివృద్ధి, పారిశ్రామికవృద్ధి నొందివఱలుచున్నది. హరిశ్చంద్రప్రసాదుగారు స్థాపించిన పంచదార ఫ్యాక్టరీలు, టెక్స్టైల్సు మిల్లులు, పాఠశాల మున్నగు సంస్థలమూలమున నితరప్రదేశములనుండి యాకర్షితులయి శ్రామికులు, విద్యార్థులు విశేషముగఁ జేరుటచేఁ బట్టణము నానాఁటికి విస్తృతమయి వృద్ధినొందుచున్నది. ఈ సంచికయందు వివిధవిషయక విజ్ఞానవిలసితములగు వ్యాసములు 34 ప్రకటితమయి యున్నవి. తణుకునకు తారకపురియను వ్యవహారము చిరవిశ్రుతమయి యున్నది. అది యెప్పు డేర్పడెనో సప్రమాణముగ నిరూపించు నాధారములు మాత్రము మృగ్యము. తారకుఁడు (జీవులకు మోక్షమిచ్చి తరింపజేయువాఁడు) శివుఁడు. అతఁడు కపిలాది సిద్ధులచే సిద్ధేశ్వరలింగరూపమున నిందుఁ బ్రతిష్ఠితుఁడయిన కారణముననేమి, తారకబ్రహ్మమగు శ్రీరాముఁడు సానుచరుఁడయి చరించి గోస్తనీతీరమున శివలింగములనిందుఁ

ప్రతిష్ఠించుటచేనేమి యీపురమునకీ వ్యవహార మేర్పడియుండునని శ్రీ గుండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "తారకాతనుకపుర నిర్వచనము-దాని ప్రాశస్త్యము" అను వ్యాసమున నిరూపింపనెంచినారు. కాని యీపురాణమున ప్రత్యేకముగ రచితమయినట్లు వారేయుదాహరించిన గౌతమీ మాహాత్మ్యమున నిందుకుపకరించు శ్లోకము లేమియుం గానరామి యీయూహకుం గొంత బాధకము కాకమానదు. "శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు, సాహిత్యసేవ" అను వ్యాసమున శ్రీ పండిత పెనుమెత్స సత్యనారాయణరాజుగారు జనులలో వ్యాప్తమయిన కొన్ని పుక్కిటిపురాణములను బట్టి ఇచ్చటికపర్దీశ్వరలింగము తారకాసురుని మెడలోని లింగమను నానుడినిబట్టి తారకాసురుని పట్టు మిదియేయని దేవదానవుల యుద్ధములోం దారకుని సంహరించుటకయి సేనాని కుమారస్వామితో దేవతలు విడిసినచోటే, తణుకు సమీపమందలి "వేల్పూరు" అని, వేల్పూరు జుత్తిగ గ్రామముల మధ్యనున్న పుంత కిప్పటికి 'దేవాసురపుంత' యను వ్యవహారమున్నదని, ఇత్యాది విషయముల వివరించిరి. విపులపరిశోధనపూర్వకముగ సత్యనిరూపణదృష్టితో "తణుకు" అను శీర్షికగల వ్యాసమును రచించిన శ్రీ ఆలమూరు రాజగోపాలరావు M.A. గారు బహురూపకములయిన చర్చలు గావించి ఏకారణములచే "తణుకు" రూపమేర్పడినదో చెప్పుటకు ఆధారములెక్కడగియున్నంతమట్టుకుం గానరావు అని తేల్చినారు. 'తణుకు' అను రూపముతోనే యీగ్రామనామము పూర్వచాళుక్యుల కాలమునాంటి దక్షారామ భీమేశ్వర దేవాలయములందలి శాసనములలో నుదాహృతమయినట్లు నిరూపించిరి. పట్టమట్ట సరస్వతిసోమయాజి రచించిన పృథుచరిత్రము అను ప్రబంధములోనాంధ్రము వ్రాసిన 'నన్నయభట్టుగారు యజనం బొనరించినచోట జన్మించెనన్నది. తణుకు-తాంధ్రపు సమున్నతమైనది' అను నాధారమునుబట్టి నన్నయభట్టారకుని జన్మస్థలము

తణుకే యనువాదము కొంతకాలముగ ప్రబలియున్నది. దానినిబట్టి నన్నయపీఠమనుపేర నొకసంస్థకూడ నీపురమున నిర్మితమయి యేటేట నన్నయ జయంతి యిచ్చట సారస్వత ప్రియులచే నిర్వహింపఁ బడుచున్నది. ఏదియెట్లున్నను నన్నయ్య కాలమునాఁటికే తణుకుపురమున్నట్లు శ్రీరాజగోపాలరావుగారు తమవ్యాసమున నిర్ధారించిరి. నేఁటి చిత్రకారులు తమయూహాగానకలనఁ జిత్రించి నన్నయపీఠమున నిలిపియున్న నన్నయభట్టారకుని చిత్రపటము ఈసంచిక 88వ పేజిలో ముద్రితమయి యున్నది. తణుకు సమీపమందలి మండపాకలో వెలసిన ఎల్లమాంబ, 'కాకతమ్మకు సైదోఁడు ఏకవీర' యని క్రీడాభిరామమునఁ గాకతీయుల కులదేవతగా నుదాహృతమయిన యేకవీరాశక్తి సైదోఁడేయని నిర్ణయించుచు శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు ప్రకటించిన "కాకతమ్మకుసైదోఁడు ఏకవీర-ఏకవీరకు సైదోఁడు ఎల్లమాంబ" అనువ్యాసము చరిత్రకారుల పరిశోధనకుపకరించు సామగ్రిని బుష్కలముగ నొసంగుచున్నది. దేవీ పురాణమందలి కొన్ని ప్రమాణములను బట్టి చంద్రవంశజుఁడయిన రజియను రాజునకు కమ్రుఁడు మున్నగు కుమారు లయిదువందలమంది కలరని, వారు దానవాక్రాంతమయినస్వర్గమును జయించి పరిపాలించుచుఁ గొంతకాలమునకు బృహస్పతి కపటోపాయమున భస్మీభూతులయిరని, పిమ్మట సూర్యవంశజుఁడయిన ఖమిత్రుఁడు అలర్కుని పాదరజస్పర్శచే వారిని బునర్జీవితులకొనర్చి కన్నకుమారులుగా నాదరించెనని యందుచే వారు "అత్యర్కేందుకుల ప్రసూతు"లని ప్రసిద్ధులయిరని, క్రమునిసంతతియే, కమ్రులు. క్రమ్రి (కమ్మ) వారని వ్యవహృతులయిరని, కాకతీయులాసంతతివారేయని సమర్థించిరి. ఇట్లు చరిత్రము, సారస్వతమునకుపకరించు వ్యాసములిందు చాలఁగలవు. వ్యవసాయమునకు, రాజకీయములకు సంబంధించిన వ్యాసములు, జీడిమామిడితోటలు, తేనెపరిశ్రమ,

అరటితోఁటల పెంపకము, నిమ్మతోఁటలు, కంపోష్టు ఎరువుల యుపయోగములు, ఫలితములు, పంచాయితీలు, గృహోపవనములు, పంచాయితీరాజ్యము మున్నగు వ్యాసములన్నియు నెల్లరు శ్రద్ధగాఁ బఠింపఁ దగినవి. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు స్వయముగ రచించిన 'పంచాయితీరాజ్యము' అను వ్యాసముచివర లిఖించిన "ధర్మశీలురైన గ్రామపౌరులున్న గ్రామరాజ్యము ధర్మరాజ్యము. ధర్మరాజ్యము గ్రామరాజ్యమైన దేశరాజ్యము రామరాజ్యమే." అను వాక్యములు నేఁటి పంచాయితీలెల్ల వేదవాక్యములుగాఁ బారాయణమొనర్చి యనుష్ఠింపఁదగినవి. 'పంచాయితీరాజ్' అని శ్రీవేంకటాద్రి చౌదరి గారు వ్రాసిన ఆంగ్లవ్యాసమునఁ గూడఁ బంచాయితీల కుపయుక్తములయిన హితబోధలు చాలగా నున్నవి. శ్రీ తిమ్మరాజుగారు తెనుఁగునకు దేశమునకుఁ గావించిన సేవ బహుముఖములుగఁ నిందుఁ బలువురచేఁ బ్రశంసింపఁబడినది. ఈ గ్రంథ ప్రకటనకు మూలస్తంభమయిన వారిసేవ యిటులిందుగ్గడింపఁబడుట యుచితమే. ఆంధ్ర దేశమునందలి పంచాయితీలకెల్ల నిది చక్కని యాదర్శమయి సత్పరిపాలనమునకయి మిగులఁ సహకరించఁగలదని మా విశ్వాసము. ఇట్టి యుత్తమ గ్రంథమును బహువ్యయప్రయాసములతోఁ బ్రకటింపఁగలిగిన శ్రీతిమ్మరాజుగారి భాగధేయము ప్రశంసనీయమని యభినందించుచున్నాము. దేశమందలి తక్కిన పంచాయితీలుకూడ వీరి మార్గమాదర్శముగాఁగొని తమపంచాయితీల చరిత్రను బరిశోధించి యిట్టి సంచికలు ప్రకటించినచో నవి దేశచరిత్రమునకుఁ గళ్యాణమునకు మిక్కిలి యుపకరింపఁగలవు.

6. గవరల ప్రాచీనచరిత్ర ప్రథమ సంపుటము. క్రౌను పుటలు 238. వెల రు 3-0-0 లు. కర్త పెదకాసెట్టి సీతారామయ్య గారు. గోలీలపాలెం, వాల్తేరు R.S., విశాఖపట్నము-4.

చూ: ఆ

ఆంధ్రదేశమున నేఁడు గానవచ్చు కాపు కమ్మ, తెలగ, బలిజ, రెడ్డి, వెలమ (పద్మనాయక) మున్నగు సచ్ఛూద్రశాఖలలో గవరలను శాఖ కూడ నొకటి చిరకాలముగ వినవచ్చుచున్నది. వీరిలో నన్యోన్యముగ వైవాహిక సంబంధములు నెఱయకున్నను నీశాఖలన్నియు నించుమించుగ నాచారములలోను మాంసాహారాది వ్యవహారములలోను సమానధర్మములతో గలిసియుంట సర్వవిదితము. అయినను జాతుర్వర్ణ్యములలోఁ దృతీయమగు వైశ్య (కోమటి) వర్ణమునకుఁ జెందిన వారిలోఁగూడ "గవర" శబ్ద ముపపదముగా 'గవరకోమట్లు' అను వ్యవహారము గలవారుకూడఁ గానవచ్చుచున్నారు. కమ్మ, తెలగ, వెలమ, రెడ్డి, మున్నగు శాఖల పుట్టుపూర్వోత్తరములఁ గూర్చి కొందఱు చరిత్రజ్ఞు లింతకుమున్న కొన్ని చారిత్రిక గ్రంథములు వ్రాసియున్నారుగాని గవరలగూర్చిన గ్రంథమేదియు నేఁటిదనుక వెలువడినట్లు కానరాదు. ప్రకృతకృతి యాలోపమును దీర్చుటకయి రచింపఁబడినట్టిది. ఇందుకు వలయు పరిశోధనమును 1930 సంవత్సరమునఁ బ్రారంభించి 1946 నాఁటికే ప్రథమసంపుటమును ముగించితినని కృతికర్త తమ పీఠికలోఁ దెలిపియున్నారు. వీరు తమ పరిశోధనములో నసంఖ్యాకములగు నాంగ్లభాషా రచిత చారిత్రక గ్రంథములను, దేశభాషాగ్రంథములను, పురాణములను నవలోకించి యీ గ్రంథమును సంతరించుట ముదావహము. నేఁటి చారిత్రపరిశోధకులు పలువురతో సంప్రతించియే వీరు తమరచనను సాగించిరి. కోమట్లలోనిగవరలు గౌరీదేవి యంశమున జన్మించినవాసవీకన్యయను కన్యకాపరమేశ్వరిని కులదేవతగాఁ బూజించువారు. సచ్ఛూద్రశాఖకుఁ జేరిన గవరలలోఁ గూడ నీగౌరీదేవతారాధనమున్నట్లు తెలియుచున్నది. కావున నీయుభయశాఖలు మొదట నేకముగానేయుండి రానురానాచారాహార వ్యవహారములలోఁ గలిగిన భిన్నతమూలమున భిన్నశాఖలుగా, నేర్పడినట్లు కానవగును. స్మృతు

లలో వైశ్య కుల ధర్మములుగాఁ జేర్కొనఁబడిన కృషి, గోరక్షణ, వాణిజ్యాదికములు నేడు సర్వసామాన్యముగఁ బూర్వోక్తములయిన శూద్రశాఖీయులకుఁ గూడ నాలంబములుగనున్నవి. గృహనామము లలో సెట్టి శబ్దము చేరినవాడు గవర కోమట్లలోనే గాక యీ రెండవ శాఖవారిలోఁగూడఁ బలువురు గానవచ్చుట పయి యూహకు సాధకము. కౌరవ, గవర శబ్దములకు సన్నిహితత్వముండుటచే గవరలు మహాభారత యుద్ధానంతరము పాండవులకుఁ గౌరవులకుఁ గలిగిన సమ్మేళన సంతతికిఁ జెందినవారయి యుందురని కొందఱు తలంచిరి. ఇది వట్టి యపోహ. ఏడు అధ్యాయములుగా రచితమయిన ప్రకృత కృతిలో గ్రంథకర్త, ప్రథమాధ్యాయములో భరతఖండమున నార్య ద్రావిడ సంఘటన సంబంధమూలమునఁ బ్రాచీనకాలమున నేర్పడిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, చాతుర్వర్ణ్య విభాగమునుగూర్చి, విపులముగఁ జర్చించియున్నారు. తరువాత రెండు, మూడు, నాలుగు అధ్యాయములలో గవరల సాంప్రదాయక గాథలు, తద్విమర్శనములు గౌర-వైశ్యగాథల విమర్శనాఫలితములు, అను శీర్షికలతో బహు విధములయిన చర్చలు గావించియున్నారు.

క్రీ శ. 1600 ప్రాంతమువాఁడగు భాస్కరాచార్యుఁడు తెలుఁగులో రచించిన వైశ్యపురాణమను గ్రంథమున రాజమహేంద్రవర ప్రాంతమందలి పెనుగొండ వాస్తవ్యుఁడు కుసుమసెట్టికి, వాసవీకన్య యను కొమరితె గలదనియు నామెను మోహించి విష్ణువర్ధనుఁడను చాళుక్యరాజు బలాత్కారముగ వివాహమాడఁ బ్రయత్నింప వైశ్యులు ప్రతిఘటించి వాసవీకన్యతో నగ్నిగుండమునఁ బ్రవేశించిరనియు, బహిష్కృతులు కొందఱు వలసపోయిరనియు, నప్పుడామె రాజును శపించె ననియు గౌరీదేవ్యంశమున జనించిన యీమెయే కన్యకాపరమేశ్వరిగా వెలసి వైశ్యులకుఁ గులదేవతయయ్యెననియు నిత్యాదిగాఁ బలువిషయ

ములు బహువ్యత్యాసములతో నిండియున్నవి. ఈ వాసవీకన్యకథయే పరంపరగా దేశమున గవరకులోత్పత్తికిఁ గారణముగా వినవచ్చుచున్నది. వాస్తవముగా నీకథ భాస్కరాచార్యుని కాలమునఁ గాని యంతకుఁ బూర్వముగాని గోదావరీమండల ప్రాంతములలో జరగియుండలేదనియు క్రీ.శ. 136 ప్రాంతమందుండిన శుంగవంశపురాజు వసుమిత్రుని కాలమందుత్తరదేశమునజరగిన యిట్టి సంఘటనయే రాను రాను బహు విధముల వికృతరూపములతో వ్యాప్తమై ప్రాకృత, సంస్కృత రచనముల కెక్కినవని, అర్వాచీనుఁడగు భాస్కరాచార్యుని యాంధ్రగ్రంథమునకుఁ గూడ నవియేమూలములని తమ యభిప్రాయములుగాఁ గృతికర్త బ్రకటించినారు

భరతవర్షమున నుత్తర దేశపు రాజులకు వేర్వేఱు కాలములలో జరగినపోరాటములు, దండయాత్రలు, రాజ్యాక్రమణాలు మున్నగు కల్లోల పరిస్థితులలోఁ బ్రజలొక దేశమునుండి మఱియొక దేశమునకు వలసపోవుట శాహాటముగా జరుగుచుండెడిదనియు, ఆకాలములలో పాంచాలదేశ రాజధానియగు అహిచ్ఛత్రమునుండి దక్షిణ దేశమునకిట్టి వలసయాత్రలు విశేషముగ జరిగినవనియు నేఁడు విశాఖపట్టణము గోదావరిజిల్లాలలోను, తదితర దక్షిణ మండలములందును నివసించు నీగవరల పూర్వులుకూడ నట్లు వచ్చినవారేయనియు నైదవ యధ్యాయమునఁ జర్చింపఁబడినది.

విశాఖపట్టణముజిల్లా అనకాపల్లి ప్రాంతమున నీ గవరలశాఖవారు కొంతహెచ్చుగ గానవచ్చుచున్నారు. వారిలో 'దాడి' యను గృహనామము గలవారు ప్రముఖులు. పరిష్కృతకృతిలో "గృహనామోపాఖ్యానము" అను సప్తమాధ్యాయమున దాడివారి వంశచరిత్ర నిరూపితమయినది. ఇందు దాడిభీముఁడు, కాళీనాయకుఁడు, వీరభోగుఁడు రుద్రదేవుఁడు, సోమయ మున్నగు నాయకులు క్షత్రియవైశ్యజీవులయి

చాళుక్యులు, కాకతీయులు, హొయసలలు, విజయనగరరాజులు మున్నగు భూపాలురకు సేనానులు, మంత్రులు, దండనాథులుగనుండి వారియుద్ధములలో సహాయులయి శాసనములు వెలయించినట్లు పెక్కు దృష్టాంతము లుదాహృతము లయినవి.

మొత్తముమీఁద నీగవరశాఖీయులు కూడఁబూర్వము కమ్మ కాపు, వెలమ మొదలగు శాఖీయులతోపాటు, దేశపరిపాలనమునఁ బ్రాధాన్యము వహించినట్లు కృతికర్త సప్రమాణముగఁ జక్కగా నిరూపించినారు. ముందుభాగములలో నీశాఖీయులలోని యితర సుప్రసిద్ధ కుటుంబములలోనిపూర్వుల చరిత్రలుకూడ సేకరింపఁబడునని గ్రంథకర్త పీఠికలో వ్రాసియున్నారు. ఒక్కగవరలకేగాక పూర్వ చరిత్రాంశములకు సంబంధించిన బహురూపక చర్చలతో విస్తృత మయిన యీగ్రంథము దేశచరిత్రకు మిక్కిలి యుపకరింపఁ గలదని విశ్వసించి గ్రంథకర్త పరిశ్రమ నభినందించు చున్నారము.

7. ఆధునిక కవులచరిత్ర ప్రథమభాగము. క్రౌనుపుటలు 44 వెల రు0 12-0 8. ద్వితీయభాగము.క్రౌనుపుటలు 76 వెల రు1-4-0.

కర్త: విద్వాన్ కోగంటి దుర్గా మల్లికార్జునరావు గారు, నివృత్తాంధ్రోపాధ్యాయులు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

సజీవులు సమకాలికులు నగు కవుల జీవిత చరిత్రములను వారి జీవితకాలములోనే రచించి ప్రకటించి వారి కృతిరచనోత్సాహము నుద్దీపించునుత్తమోద్దేశముతో శ్రీ దుర్గామల్లికార్జునరావుగారు తమ విఘ్నేశ్వరగ్రంథమాలికలో నాధునిక కవుల చరిత్రములను బ్రకటింప బూనుకొనుట ముదావహము. "ఏగతి రచియించితేని సమకాలము వారలు మెచ్చరేగదా!"అనియేనాఁడో చేమకూర వేంకటకవి యంత టివాఁడు వ్యంగ్యముగ వాపోయినాఁడు. కావుననీ యుద్యమ మాధునిక

కవులకు హర్షదాయకము, నభ్యుదయకరము నగుననుటలో నాశ్చర్యము లేదు. ఇది సముద్రమున కెరటాల మెత్తుట వంటిదేయనుటకు సంశయము లేదు. స్వీకరించిన చరిత్రముల నెప్పటికప్పుడే సంపుటములుగాఁ బ్రకటించుటచే నిందులోఁ గాలపౌర్వాపర్యమును (chronology) పాటించుటకు వీలులేదు.

ప్రథమభాగములో శ్రీ వావిలాల రామమూర్తి, జాస్తి వేంకటనరసయ్య, కొత్త భావయ్యచౌదరి మున్నగు పదునేవురు కవులయు రెండవభాగములో శ్రీ ఎఱసూరి మల్లికార్జునరావు, ఆకుండి వేంకటశాస్త్రి, జంపాల వేంకటనరసింహము మొదలగు నేడ్వురు కవులయు జీవితచరిత్రము లింతవఱకు సందానింపఁబడి యున్నవి వీరు చాలమంది కృష్ణా, గుంటూరు మండలములకుఁ జెందినవారు. ఆయా కవుల చరిత్రములలో వారి ముద్రితాముద్రిత రచనములు రెండును గూడ నుదాహృతములయి, యందుండి కొన్ని కొన్ని పద్యములు పేర్కొనఁబడినవి. కొందఱు కవులు నేఁటి కాలానుగుణముగ రచించిన గేయములు, బుఱ్ఱకథలు కూడఁ బేర్కొనఁబడి యందుండి కూడ నుదాహరణము లీయఁబడినవి. కొందఱు చరిత్రములలో వారికందనుముఁగలిగిన సన్మాన సందర్భములలో నితరులు సమర్పించినపద్యములు, సన్మానపత్రములు వానిపయి నాకవు లొసంగిన సమాధానములుకూడ నుదాహృతములయి వానితోఁ గొంత గ్రంథవిస్తరణము గావింపఁబడినది. ఇట్టియెడల నాసంఘటనములు మాత్రము సూచించినఁ జాలునని మా యభిప్రాయము.

మొత్తముమీఁద శ్రీ మల్లికార్జునరావుగారి యీ నూతనోద్యమము ప్రశంసనీయమని చెప్పనక్కఱ లేదు. ఆంధ్రసోదరులు దీని నభినందించి ముందటిభాగముల సత్వర ప్రకటనమునకయి సహకరింతురుగాక యని హెచ్చరించుచున్నాను.

# వ్య క్తి వి వే క ము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

శాబ్దప్రక్రమభేదము :-

చారుతావపు రభూషయ దాసామ్, తా మనూనవయౌవనయోగః
తం పున ర్మకరకేతనలక్ష్మీః, తాం మదో దయితసంగమభూషః

అర్థము :-ఆసాం=ఈ స్త్రీలయొక్క, వపుః=శరీరమును, చారుతా=సౌందర్యము, అభూషయత్=అలంకరించినది. తామ్=ఆచారుత్వమును, అనూనవయౌవనయోగః=సంపూర్ణమగు యౌవనసంపత్తి, అభూషయత్=అలంకరించినది. తం,పునః=ఆయౌవన యోగమును, మకరకేతనలక్ష్మీః=మన్మథసంపత్తి (అలంకరించినది); తామ్=ఆమకరకేతనలక్ష్మిని, దయితసంగమభూషః=ప్రియసమాగమమే అలంకారముగా గల, మదః=మదము, అలంకరించినది.

వివృతి :-మొదటి మూడుపాదములందును నలంకారకములగు సౌందర్యము, యౌవనయోగము, మకరకేతనలక్ష్మి యనువస్తువులు తదితరవస్తు సంబంధములేకయే, స్వతంత్రముగనే చారుతాదిశబ్దములచే ప్రతిపాదితములైనవి. నాల్గవపాదమున నట్లులేదు. పూర్వపాదములందలి పద్ధతిననుసరించి, యిచటఁగూడ "మకరకేతనలక్ష్మిని మదము, మదమును దయిత సంగమము, అలంకరించినవి" అని దయితసంగమమును ప్రత్యేకముగ పేర్కొనవలసియుండెను. కాని, "దయితసంగమమే యలంకారముగాఁ గల" యని బహువ్రీహిని చెప్పుటచే దయితసంగమము, మదమునకు విశేషణమై, (సమాసములో నుపసర్జనమై) స్వతంత్రతను గోల్పోయినది. ఇట్లు శాబ్దాన్వయక్రమము భేదించుచుండుటచే నీపద్యము శాబ్దప్రక్రమ భేదమున కుదాహరణమైనది.

ఈదోషము పోవలెనన్న నీశ్లోకములోని చివరపాదమును, "తాం మదస్తమపి వల్లభసంగః" అని మార్పవలయును.

వేఱొక యుదాహరణము :-

"సస్నుః పయః పపు రనేనిజు రంబరాణి
జక్షు ర్బిసాన్ ధృతవికాసిబిసప్రసూనాః"

ఇచటఁగూడ పూర్వక్రమము ననుసరించి "వికసించిన తామర పూలను ధరించిరి" అనియుండుచో బాగుండెడిది. ప్రస్తుతమున్న రీతి ననుసరించి "ధరింపఁబడిన బిసప్రసూనములు కలవారై" అని యర్థము వచ్చును. అపుడు "బిసప్రసూనములు" బహువ్రీహి సమాసములో నుపసర్జనములై స్వతంత్రములుగ భాసింపవు. కావున నిచటఁగూడ శాబ్దప్రక్రమభేద దోషమున్నది. దీనిని పరిహరించుటకై "జక్షుర్బిసం వికచ మస్య దధుః ప్రసూనమ్' అని మార్పవలయును. (వికచమ్-వికసించిన. అస్య=తామరయొక్క,ప్రసూనమ్=పుష్పమును దధుః=ధరించిరి. పైన, పయః, అంబరాణి, బిసాన్-అనునవి ద్వితీయావిభక్తిలో నున్నట్లే, ప్రసూనమ్ అనునదియు ద్వితీయావిభక్తియందే స్వతంత్రముగ నున్నది.

మొదటిపాఠమున- "జక్షుర్బిసాన్-ధృతవికాసిబిస ప్రసూనాః" అనునపుడు, బిస శబ్దము రెండుపర్యాయములు వచ్చుటచే పునరుక్త దోషము వచ్చినది. మార్చిన పాఠములో "వికచమస్య" అనునపుడు "అస్య" అనుపదముచే బిసము పరామృష్టమైనది. రెండవ పర్యాయము బిసశబ్దము పేర్కొనఁబడలేదు. కావున పునరుక్తదోషముకూడఁ దొలగిపోయినది.

ఉదాహరణాన్తరము :-

"సమతయా వసువృష్టి విసర్జనై ర్నియమనాదసతాంచ నరాధిపః
అనుయయౌ యమ పుణ్యజనేశ్వరౌ సవరుణావరుణాగ్ర సరంరుచా"-

అర్థము :- నరాధిపః=దశరథుఁడు, సమతయా=అందఱియెడల సమానముగ నుండుటచేతను, వసువృష్టి విసర్జనైః=ధనవర్షమును కురి

పించుటచేతను, అసతామ్=దుష్టులయొక్క, నియమనాత్ చ=నిగ్రహమువలనను, సవరుణౌ=వరుణునితోఁగూడిన, యమపుణ్యజనేశ్వరౌ=యమునకు బేరులను (యమకుబేరవరుణులను), అనుచకార=పోలియుండెను రుచా=కాన్తితో, అరుణాగ్రసరమ్=అరుణుఁడే సారథిగాఁగల సూర్యుని అనుయయౌ=అనుసరించెను (పోలియుండెను).

పైశ్లోకములో "సవరుణులైన (వరుణునితోఁగూడిన) యమపుణ్యజనేశ్వరులను అనుకరించెను." అని వాక్యమున, 'అనుకరించెను' అనుక్రియ యమపుణ్యజనేశ్వరులతో సాక్షాత్తుగ నన్వయించుచున్నది. వరుణశబ్దము సమాసమునందుండుటచే నాశబ్దముతో సాక్షాత్తుగ నన్వయమునొందుటలేదు. అర్థమునను సరించి, వరుణునితోఁగూడ ననుకరోతి శబ్ద మన్వయించుచున్నదని తెలిసికొనుచున్నాము. అనఁగా ననుకరోతి వరుణశబ్దముల కార్థాన్వయము మాత్రమేయున్నది. అసత్పురుష నియమనము (అసతామ్ నియమనాత్) వరుణు ననుకరించెనని చెప్పుటకు హేతువుగ నుపాత్తమైనది ఈహేతు ప్రతిపాదకశబ్దమునకు సాక్షాత్తుగ నన్వయమున్నది.అందుచే వీనికి శాబ్దాన్వయము కుదిరినది. ఇప్పుడు వరుణు ననుకరించెనను వాక్యమున నార్థాన్వయమును,అనుకరణమునకు హేతువును నిరూపించుశబ్దములకు శాబ్దాన్వయమునునుండుటచే ప్రక్రమభేదదోషము వాటిల్లినది. రెండుతావులను నార్థాన్వయమే యున్నచో నీదోషముండెడిది కాదు.ఆదోషముపోవలయునన్నచో "నియమయ న్నపత స్స నరాధిపః" అని పాఠమును మార్చవలయును.అసతః=అ సత్పురుషులను, నియమయన్=నియమించుచు- అనియర్థమువచ్చును. నియమనాత్ అనునపుడు, పంచమీవిభక్తి హేతుత్వమును సాక్షాత్తుగ ప్రతిపాదించును. "నియమయన్" అనునపుడట్టివిభక్తి లేదు. ఆ హేతుత్వము, శబ్దప్రతిపాదితమగుటలేదు. అర్థవశముననే ప్రతీతమగును. ఇపుడు హేతుప్రతిపాదక శబ్దములకుగూడ నార్థాన్వయమే లభించినది.

అనుకరోతి యను క్రియయందు వరుణునకున్న కర్మత్వముకూడ నర్థ బలముననే వచ్చినది. రెండు తావులను నార్థాన్వయమే లభించినది. దోషము పరిహృతమైనది.

(ఇచట వ్యాఖ్యాకర్త చూపినమార్గములను గ్రంథాంతమందలి విశేష వ్యాఖ్యలలో చూడనగును.)

మూలపాఠమునందు— "విసర్జనైః" అనునది తృతీయా విభక్తిలో నున్నది. "నియమనాత్" అనునది పంచమీవిభక్తిలోనున్నది. హేతుత్వ మొకచోట తృతీయతోను, మఱియొకచో పంచమితోను ప్రతిపాదితమైనది. విభక్తిప్రక్రమదోషము వచ్చినది. "నియమయన్" అనునపుడు, హేతుత్వము శబ్దప్రతిపాదితమే కాదు. అందుచే ప్రక్రమ దోషము పోయినది.

సంస్కృతభాషయందు, సమానమగువానికి రెంటికి సముచ్చయము చెప్పవలసివచ్చినపుడు చకారమును ప్రయోగింతుము. మూలపాఠములో చ శబ్దము 'అసతాం' తరువాత నున్నది.

అసత్పురుషులయొక్కయు నియమనమువలన ననునర్థము లభించును. ఇచట "యు" (చ) సముచ్చయార్థకము. శిక్షితులైన వారినెవరినైన నింతకుముందు చెప్పియున్నచో, వారిని అసత్పురుషులనుగూడను శిక్షించెను; అని చెప్పవచ్చును. కాని అట్టివారి నెవరిని పూర్వము పేర్కొనలేదు. లేనపుడు సముచ్చయార్థకమగు చకారము "అసత్పురుష" శబ్దము తరువాతనుండుట వ్యర్థమై దోషతాపాదకమగుచున్నది. చశబ్దమునకు సముచ్చయార్థము లభించుటలేదు. ఇది యొకదోషము. అసముచ్చేతవ్యమగు అసత్పురుషశబ్దము తరువాతనుండుట వలన ప్రక్రమభేద దోషముకూడ సంభవించినది. "నియమనాత్ చ" అనియుండవలయును. ఇంతకుఁబూర్వము సమతయా, విసర్జనైః—అను రెండుపదములచేతను రెండుహేతువులు ప్రతిపాదితములైనవి. "నియమనము"

అనునది మూఁడవహేతువు. హేతువులన్నియు సమానములైనవి. కావున వెనుకటి రెంటినికలుపుకొని, యీమూఁడవహేతువునకు సముచ్చయమును తెల్పుట కిచట "చ" శబ్దముండుట సార్థకమయ్యెడిది. అట్లు చెప్పకుండుటచే నిచట మూలపాఠములో క్రమభేదదోషము కూడ వచ్చినది. "నియమయ న్ననత స్స నరాధిపః" అని పాఠమును సవరించినపు డీదోషములన్నియును పోయినవి. ఇచట చకారమే లేకుండుటచే పై దోషములు లేవు.

ఇటులే యితరదోషములనుగూడ నూహింపవలెను. ఈదోషముల పరస్పరసాంకర్యమువలన (లోష్టసంచారక్రమమున) ప్రక్రమభేదదోషము లనేకప్రకారములుగ నుద్భవించును. వానిని స్వయముగ నూహింపవలెను.

ఉదాహృతి—ప్రకృతిప్రక్రమ భంగదోషము; ప్రత్యయప్రక్రమ భంగదోషము.

"నియతా లఘుతా నిరాయతే
రగరీయాన్న పదం నృపశ్రియః"

ఇచట మొదట "లఘుతా"యనుచోట లఘుశబ్దము ప్రకృతి. ఈ లఘుశబ్దముయొక్క యర్థమునే తిరిగి "అగరీయాన్" అనుపదముతోఁ జెప్పినాఁడు. ఇచట గురు శబ్దముప్రకృతి. లఘుశబ్దముతో నుపక్రమించి నపుడుతిరిగి లఘుశబ్దముతోనే దానిని పరామర్శింపక, గురుశబ్దముతో పరామర్శించుట ప్రకృతిప్రక్రమదోషము. లఘుశబ్దము తరువాత "తా" అను ప్రత్యయమున్నది. గురుశబ్దము తరువాత "ఈయసున్" ప్రత్యయమున్నది. రెండుచోట్ల నొకే ప్రత్యయము లేకుండుటచే ప్రత్యయప్రక్రమ భేదదోషముకూడ నిందున్నది. ఈదోషములను పరిహరించుటకు"నలఘు ర్జాతుపదం నృపశ్రియః"అని పాఠమును మార్పవలయును.

అర్థప్రక్రమభేదము :-

ఇంతకుఁ బూర్వమిచ్చిన యుదాహరణములలో "చారుతా వపు రభూషయత్" అను శ్లోకములోని పాదములను వ్యత్యస్తముగాఁ జదువుచో నది యర్థప్రక్రమ భేదమున కుదాహరణమగును.

"మత్తతా దయితసంగమభూషా
భూషయ త్యసమసాయకలక్ష్మీమ్,
సా వ్యనూన నవయౌవనయోగమ్
తద్వపు స్తదపి చారుతరత్వమ్"

తా॥ ప్రియసమాగమమే భూషణముగాఁగల మత్తత,మన్మథలక్ష్మి నలంకరించుచున్నది. ఆమన్మథలక్ష్మి నవయౌవన సంబంధమును, ఆసంబంధము శరీరమును, ఆశరీరము సౌందర్యాధిక్యమును నలంకరించుచున్నవి.

ఇచట-ప్రియసమాగమము మత్తత నలంకరించుచున్నది-అను విషయము 'దయిత సంగమభూషా'యను బహువ్రీహి సమాసములో నంతర్భావము నొందినది. సమాసార్థ బలమువలన మాత్రమే యీ యర్థము లభించుచున్నది. 'దయిత సంగమః మత్తతామ్ భూషయతి' యనువాక్యము లేదు. శ్లోకాన్తమున "తత్ వపుః చారుతరత్వమ్ భూషయతి" అను వాక్యమున్నది. అలంకరించుటయను నర్థమును భూషయతి యను క్రియయే స్పష్టముగఁ జెప్పును. "అలంకరించుచున్నది" అను నర్థము మొదటి పాదమునందర్థబల లభ్యము, చివరిపాదమునందు శబ్దలభ్యము నగుచున్నది. అంతటను నర్థబలలభ్యముగ లేదు. కావున నిచట నార్థప్రక్రమ భంగమున్నది:-

ప్రస్తుత మీయార్థ ప్రక్రమ దోషము, పరిహృతము గావలయునిన, "మత్తతామ్ దయితసంగతి రేషా" అని యుండవలయును. అపుడు "మత్తతామ్ దయిత సంగతిః భూషయతి" అను వాక్యము

వచ్చును. అలంకరించుననునర్థమును, 'భూషయతి' యను క్రియాశబ్దమే చెప్పును. శ్లోకమున నాద్యంతములొకతీరుననే యుండును.

క్రమప్రక్రమ భేదము:-

తవ కుసుమశరత్వం శీతరశ్మిత్వ మిందోః
ద్వయ మిద మయథార్థం దృశ్యతే మద్విధేషు,
విసృజతి హిమగర్భై రగ్ని మిందు ర్మయూఖైః
త్వమపి కుసుమబాణాన్ వజ్రసారీకరోషి.

అర్థము :-తవ=నీయొక్క, కుసుమశరత్వమ్=పుష్పబాణము గలిగియుండుట, ఇందోః=చంద్రునియొక్క, శీతరశ్మిత్వమ్=చల్లని కిరణములు కలిగియుండుట, ఇదంద్వయమ్=ఈరెండును, మద్విధేషు=నాబోటి వారివిషయమై, అయథార్థమ్=అసత్యముగా, దృశ్యతే=కనుపడుచున్నది. ఇందుః=చంద్రుఁడు, హిమగర్భైః=మంచుగర్భమునందుఁగల, మయూఖైః=కిరణములతో, అగ్నిమ్=అగ్నిని. విసృజతి=వదలుచున్నాఁడు. త్వమపి=నీవుకూడ, కుసుమబాణాన్=పుష్పబాణములను, వజ్రసారీకరోషి=వజ్రసారము కలవానినిగాఁ జేయుచున్నావు.

వివరణము :-దుష్యన్తుడు మన్మథునుపాలభించుచున్నాఁడు. ఇచట మొదటిపాదములో, మన్మథుఁడు చంద్రుఁడును క్రమముగ నుపాత్తులైనారు కాని మూఁడునాల్గుపాదములలో, మొదటఁ జంద్రుఁడును, తరువాత మన్మథుఁడును పరామృశింపఁబడినారు. క్రమము తప్పినది. కావున క్రమప్రక్రమభేదమున కిది యుదాహరణము.

(సమ్ముఖమునయున్న మన్మథుని వదలి ప్రసంగవశమున వచ్చిన చంద్రుని ప్రథమముగ నిర్దేశించుట తగదనియు, నటులే ప్రసంగవశాగతుఁడగు చంద్రునితో వ్యాకార్థమును బరిసమాప్తము చేయుటయు నుచితముగాదనియు నందుచే నాద్యన్తములయందు సమ్ముఖముననున్న మన్మథనిర్దేశమే యుచితమనియు రుయ్యకుఁడు తనవ్యాఖ్యానమున

వ్రాసినాఁడు. ఈతనిమతమున నీశ్లోకము క్రమప్రక్రమభేదమున కుదాహరణము గానేఱదు.)

ప్రశ్న:-అర్థమును ప్రతిపాదించుటకు శబ్దము నుపయోగింతుము. శబ్ద మర్థప్రతిపాదనమున నుపాయముమాత్రమే. ప్రతిపాద్యమైనయర్థము ప్రధానమైనది. సాధనమగు శబ్దము ప్రధానము కాదు. అందుచే నర్థము భాసించుచున్నచో నేశబ్దమును ప్రయోగించినను దోషమే లేదు. ఒక గ్రామమునకు వెళ్లుట కనేకమార్గములుండును. ఏమార్గముననుసరించిన నేమి ? గ్రామముచేరుటయే ప్రధానము. ఈవిషయము నాలోచించియే శాస్త్రజ్ఞు లిట్లు చెప్పినారు.

"ఉపాదాయాపి యే హేయా స్తానుపాయాన్ ప్రచక్షతే
ఉపాయానాంతు నియమో నావశ్య మవకల్పతే.

తా. ఫలసిద్ధియైన తరువాత విడిచివేయఁదగినవాని నుపాయములందురు. ఉపాయములవిషయమై యవశ్యముగ నవలంబింపవలసిననియమము లేవియు లేవని తాత్పర్యము. కావున ప్రకృతులు, ప్రత్యయములు, పర్యాయపదములలో నుపక్రమోపసంహారములలో భేదమున్నను, నర్థములో భేదములేకుంటచే శబ్దమాత్రభేదమువలన నర్థప్రతీతికి భంగముకలుగదు. అందుచే ప్రకృతిప్రత్యయాది ప్రక్రమభేదము శబ్దానౌచిత్యమనుట యెట్లు పొసగును ?

సమాధానము :-ఇటువంటి ప్రక్రమభేదమంతయు సాధారణముగ విధ్యనువాదభావమునకు సంబంధించినది. విధ్యనువాదభావమునందు శబ్దభేదము పనికిరాదు. ఇచటఁగూడనంతియ విధ్యనువాదములలో రెండుతావులందును నొకేశబ్దమొక యర్థమును చెప్పుచో పఠితకేకరసప్రతీతి కలుగును. పూర్వము నిర్దేశించినవిషయమునే యిపుడును నిర్దేశించుచున్నాఁడని పఠిత తలఁచును. శబ్దభేదమున్నచో పూర్వముపాత్తమైన యర్థమే, మఱియొకయర్థమువలె భాసించును. అపుడు

విధ్యనువాదభావము సులభముగ మనసునకెక్కదు. కావునఁ బూర్వము చెప్పినయర్థమే యిదియని ప్రత్యభిజ్ఞ కావలయునన్నచోఁబూర్వము ప్రయుక్తమైన శబ్దమునే యిపుడును ప్రయోగింపవలయును. అట్లు ప్రయోగింపనిచో, నింతకుముందు తెల్పినయర్థమును బోధించుటకే క్రొత్తశబ్దమును ప్రయోగించుటలో నభిప్రాయ మేమైయుండును ? అని పఠిత కాలోచనగల్గును. ఆసంశయము కడుగకుండవలయునన్నచో నొకేశబ్దమును విధ్యనువాద స్థలములలోఁ బ్రయోగించితీరవలయును. వైశాస్త్రీయ ప్రమాణము మన కిచట నుపయోగింపదు. ప్రస్తుతము మన మాలోచించునది కావ్యవిషయము శాస్త్రమర్యాదకును కావ్యమర్యాదకును భేదమున్నది. కావ్యమునందర్థ ప్రతీతికిమాత్రమే శబ్దమును ప్రయోగింపరు. శబ్దమునకుప్రాధాన్యము లేదని యంగీకరింపము. శబ్దార్థములకు రెంటికిని సమానప్రాధాన్యమున్నది. అందుచేతనే కావ్యాది వాఙ్మయమును సాహిత్య మనినాము. శబ్దార్థముల సాహిత్యము నే సాహిత్యశబ్దము సూచించును. కావున శబ్దమర్థప్రతీతి కుపాయమైయప్రధానమగుచున్నదనుట సమంజసముకాదు.

విధ్యనువాదస్థలములో నర్థభేదము లేకున్నను శబ్దభేదము నంగీకరింపరనుట కుదాహరణము.

"యదధరదల మాశ్రితమ్ ప్రియాయా
వదనసరోరుహసామ్య మేతి యశ్చ,
తదమృత మమృతమ్ స ఇన్దురిన్దుః
విషమితరత్ తమసా సమ స్తథాన్యః.

అర్థము :-యత్ =ఏది, ప్రియాయాః=ప్రియురాలియొక్క,అధరదలమ్, ఆశ్రితమ్=క్రిందిపెదవి నాశ్రయించినదో, యఃచ=ఎవఁడు,వదనసరోరుహసామ్యమ్, ఏతి=ముఖపద్మముతో సామ్యమును పొందునో, తత్ అమృతమ్=ఆ అమృతము, అమృతమ్=అమృతము స ఇన్దుః=

చంద్రుఁడు, ఇందుః=చంద్రుఁడు ఇతరత్ =అట్లు కానిది విషమ్ =విషము, అన్యః=ఇతరుఁడు; తమసా సమః=చీకటితో సమానుఁడు.

వివరణము:-ఇచట 'అమృత మమృతమ్' 'ఇన్దు రిన్దు' అని విధ్యనువాదస్థలములలో రెండుచోట్లను నర్థభేదములేకున్నను, శబ్దములు కూడ మాఱలేదు. విధ్యనువాదస్థలమున నీపద్ధతిని పాటించుచున్నాము-ప్రక్రమ భేదముకూడ విధ్యనువాదప్రకారమే యగుటచే నిచటఁగూడ శబ్దభేదము లేకుండుటయే యుచితము

మఱియొకప్రశ్న- పోనిండు, మీరు చెప్పినదంగీకరింతుము. కాని మఱియొక విషయమున్నది. శాబ్దప్రక్రమ భేదము, ఆర్థప్రక్రమ భేదము నను నీవిభాగమే యుచితముగ లేదు.

ఏలన, "చారుతా వపు రభూషయ దాసాం" మొదలగు పద్యములందు భూషణభూష్య భావ రూపమున నుండు నొకవిషయము ప్రతిపాదితము కావలయును. అది శబ్దమునుండియో, యర్థమునుండియో, లేకశబ్దార్థములనుండియో, యెట్లైనను భాసింపవచ్చును. కేవలము శబ్దమునుండియో, కేవలమర్థమునుండియో భాసింపవలెనను పట్టుదల యేల ?- ప్రారంభమునమన్న శబ్దాదులు భేదించినచో ననౌచిత్యమని యను నియమము సేయుటలో నర్థము కన్పడుటలేదు.

"శుచి భూషయతి శ్రుతం వపుః
ప్రశమ స్తస్య భవ త్యలంక్రియా,
ప్రశమాభరణః పరాక్రమః
స నయాపాదితసిద్ధిభూషణః"

అర్థము -శుచి=పవిత్రమైన; శ్రుతమ్ =విద్య; వపుః=శరీరమును భూషయతి=అలంకరించును;తస్య=ఆవిద్యకు;ప్రశమః=శాన్తము; అలంక్రియా,భవతి=అలంకారమగును; పరాక్రమః=శౌర్యము; ప్రశమాభరణః=శాన్తిరాభరణము; సః=ఆపరాక్రమము; నయాపాదితసిద్ధి

భూషణః=నీతిచే (వివేకముచే) సంపాదింపఁబడిన సిద్ధియే యలంకార ముగాఁ గలది–

ఇచట 'శుభ్రితం,వపుః, భూషయతి'యని శాబ్దాన్వయ మున్నది. "స నయాపాదిత సిద్ధిభూషణః" అని యార్థాన్వయమున్నది. భూషణ భూష్యభావరూపమగునర్థమే మొదట శాబ్దాన్వయమునను, తరువాత నార్థాన్వయమునను, భాసించుచున్నది. అందుచే ప్రతీతిలో పరిస్ఖల నము కలుగుచున్నది. అయినను నిచట ననౌచిత్య మేమియు భాసిం చుట లేదే! –

సమాధానము:- ఈమాటలుచెప్పువారికి శబ్దార్థవ్యాపార విభా గము తెలియదని చెప్పవలయును. శబ్దవ్యాపారమునకు విషయమగు నర్థమువేఱు. ఏయర్థమును సాక్షాత్తుగఁ జెప్పనెంతుమో యది శబ్ద వ్యాపారమునకు విషయము. ఆయర్థమునకుశబ్దముతో సాక్షాత్సంబంధ ముండుటచే నది శాబ్దమైనది. సాక్షాచ్ఛబ్ద సంబంధము లేనియర్థము నర్థవ్యాపారమునకు విషయమని యందుము. ప్రస్తుతము, భూషణ భూష్యభావము, ప్రధానముగఁ జెప్పనెంచిన విషయమగుటచే నదిశబ్ద వ్యాపారమునకే విషయమగును. అర్థవ్యాపారమునకు విషయముగాదు. విషయవిభాగ మిట్లున్నది. దీనికి విరుద్ధముగ నున్నచో నేకరసప్రతీతికి భంగము కలుగును. అందుచే నింతకు బూర్వపు టుదాహరణములలో ననౌచిత్య దోషమున్నదనినాము. ఈపరిస్థితులలో మీరు– "శుచి భూషయతి" మొదలగు తావులందు ప్రక్రమభేదమున్నను ననౌచిత్య సంస్పర్శ భాసించుట లేదనినారు. ఇపుడీపని చేయుఁడు. "వపుషః శుచి భూషణమ్ శుభ్రితమ్" అనియు, "తామ్ మద స్తమపి వల్లభసంగః" అనియు పూర్వశ్లోకములను సవరింపుడు.

అట్లు సవరించుచుచోఁ బ్రక్రమభంగదోషముపోవును. ఇపుడు మార్చిన శ్లోకమును మొదటిశ్లోకమును రెంటిని జదువవలెను. వాని

యర్థములు భాసించుటలో నౌచిత్యముగాని యున్నదా లేదా యను విషయమును, శ్లోకార్థసారములను గుర్తింపఁగల సహృదయుల నడిగి తెలిసికొనవలయును–సహృదయులు కాని వారికి రెండు శ్లోకముల యర్థములును నొక తీరుననే భాసించును. కావున వారినడిగి నను ప్రయోజనము లేదు.

ఇచట నింకొక తీరునఁగూడ సమాధానమును చెప్పుకొనవచ్చును. "శుచి భూషయతి" మొదలగు శ్లోకములయందు భూషణభూష్యభావశృంఖల యొకటియున్నది– ఆ శృంఖలాబంధము వలన నొక యలంకారవిశేషము భాసించును. ఆ యలంకారవైచిత్ర్యమే, కవికిచట వివక్షితము–అది బాగుగనే నిర్వహింపఁబడినది–ఈభావనచేఁ బరవశులైన పాఠకులకు, శ్లోకార్థప్రతీతి కుంటుపడినదని స్ఫురింపదు. అందుచే నా శ్లోకార్థములోననౌచిత్యము లేదని తలఁతురు-ఇట్లనియే మనము భావింపవలయును. శ్లోకార్థమున ననౌచిత్యము లేదని చెప్పుటకు వీలు లేదు.

ఆక్షేపము:– శబ్దవ్యాపారమునకు విషయమగు నర్థమే ప్రధానమైనది. తదితరార్థము ప్రధానముకాదు.

సమాధానము:– అగుచో "చక్రాభిఘాత ప్రసభాజ్ఞయైవ" "లావణ్యకాన్తి పరిపూరిత దిఙ్ముఖేస్మిన్" "కృతకకుపితైర్బాష్పాంభోభిః" మొదలగు శ్లోకముల విషయమున నీవాదము నిలువదు.

"చక్రాభిఘాత ప్రసభాజ్ఞయైవ
చకార యో రాహువధూజనస్య
ఆలింగనోద్దామ విలాసవన్ధ్యమ్
రతోత్సవమ్ చుంబనమాత్రశేషమ్"

తాత్పర్యము – విష్ణువు, రాహువును చక్రముతోఁ గొట్టినాఁడు-తత్ఫలితముగ, రాహువు భార్యకు, రతిక్రీడయందు భర్తనాలింగనము

చేసికొను భాగ్యము పోయినది. చుంబనమునకు మాత్రమే యవకా శము మిగిలినది.

ఈ శ్లోకమునందు విష్ణువు రాహువుయొక్క శిరస్సును ఛేదించి నాడను వస్తువు వ్యంగ్యమగుచున్నది. ఈయర్థము శబ్దవాచ్యముగాదు.

"లావణ్యకాన్తి పరిపూరితదిఙ్ముఖేస్మిన్" అను శ్లోకమునందు "రూపకాలంకారము" భాసించుచున్నది. ఇదియును ప్రతీయమానమే గాని, వాచ్యముగాదు.

"కృతకకుపితై ర్బాష్పాంభోభిః" అను శ్లోకమునందు విప్రలంభ రసము ప్రతీయమానమేగాని వాచ్యముగాదు – ఈపై నిఁజూపఁబడిన వస్త్వలంకారరసములు మూఁడును నర్థబలలభ్యములేకాని శబ్దవాచ్య ములుగావు. మీవాదము నంగీకరించుచో నివి యప్రాధాన్యములే గావ లయును. అది యెవరికిని నిష్టముగాదు. చ్యము, ప్రతీయమానము నని, యనుకొనఁబడుచున్న యర్థములకు, అగ్నిధూమములకువలె గమ్యగమకభావమున్నది. ప్రతీయమానార్థము గమ్యము–వాచ్యార్థము గమకము. అందు గమ్య ముపేయమగుటచే ప్రధానము. గమక ముపాయమగుటచే నప్రధానము కావున శబ్దవ్యాపారమునకు విషయ మగు నర్థముకంటె, నర్థవ్యాపారమునకు విషయమగు నర్థము ప్రధాన మని యంగీకరింపవలయును.

ఇచట నీవిషయము నాలోచింపవలయును.-ప్రాధాన్యా ప్రాధా న్యములనునవి రెండు విధములుగ నున్నవి. ప్రతీతి ననుసరించి యొక వ్యవస్థనుచేయవలయును.

ఈ వ్యవస్థననుసరించి, శబ్ద మొక యర్థమును చెప్పునపుడు, శబ్దార్థములలో నర్థముప్రధానమైనది. అర్థమును మఱియొకయర్థమును స్ఫురింపఁ జేయునపు డావ్యంగ్యార్థము ప్రధానము. ఉపాయోపేయ భావముననుసరించి చేయఁబడు వ్యవస్థ రెండవది.– దీనిననుసరించి శబ్ద

వ్యాపార విషయమగు వాచ్యార్థము, వ్యంగ్యార్థమున కుపాయము. వ్యంగ్యార్థ ముపేయము. ఉపాయోపేయములలో నుపేయమే ప్రధాన మైన దగుటచే వ్యంగ్యార్థము వాచ్యార్థముకంటె ప్రధానమైనది. పై నుదాహృతములగు వస్త్వలంకారరసముల ప్రాధాన్యము ధూమాగ్ను లకువలె గమ్యగమక భావాపేక్షమైనది. అనగా నుపాయోపేయ భావాశ్రయమైనది- ప్రతీత్యపేక్షమైనదిగాదు- ఈగమ్యగమక భావా పేక్షమగువ్యవస్థననుసరించియే, ప్రతీయమానార్థమున్నపుడు, వాచ్యా ర్థముగూడ నప్రధాన మగుచున్నది.

ప్రశ్న:- ఏకవిధముగఁ గలుగుచున్న ప్రతీతి ప్రవాహమునకడ్డు తగులుచుండుటచే, ప్రక్రమ భేదదోషము ననౌచిత్యముగఁ బరిగణించి నారు. అగుచో మహాకవులు తమ కావ్యములయం దొక వస్తువునే వర్ణించునపుడుగూడ ననేకాలంకారముల నుపయోగించుచున్నారు. అనేకరీతుల నొకేవస్తువును వర్ణించుచున్నారు. ఏకైకరీతి యెచటను కన్పడదు. కావున నచటఁగూడ నీప్రక్రమభేదదోష మున్నదని యంగీ కరింతురా ?

సమాధానము:- అంగీకరింతుము.

ప్రశ్న:- అగుచో నచట వైరస్యమును ప్రకటింపరేల ?

సమాధానము:- అందుకు రెండు కారణములున్నవి. చంద్ర బింబమునందును, స్త్రీముఖమునందును కొద్దికళంకమున్నను, వారి సౌందర్యములో నామచ్చ మునిగిపోవును. చూచువారికి వానియందలి సౌందర్యమే భాసించునుగాని కళంకము భాసింపదు. అంతమాత్ర మున నచట కళంకము లేదందుమా ? అటులే, యిచట మధురమైన యలంకారపరంపరలచే నీప్రక్రమభేదదోష మాచ్ఛాదితమగుచున్నది. అందుచే నాదోషము కనుపడదు. కనుపడనపుడు వైరస్యము నెందుకు ప్రకటింతురు ? ఈసందర్భమున కాళిదాసవాక్యము స్మరింపఁదగును.

"ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీం దోః కిరణేష్వివాంకః"

చంద్రుని కిరణములయందు మచ్చ మునిగిపోయినట్లే గుణసమూహమునందొక దోషము మునిగిపోవును. మఱియొక కారణము గూడఁగలదు. ఆ మహాకవుల వర్ణనములలో నొక వాక్యములోనున్న భంగిభణితివైచిత్ర్యము మఱియొక వాక్యములోని భంగిభణితివైచిత్ర్యము (అలంకారము)కంటె భిన్నమైనది. ఇట్లు వాక్యభేదముండుటవలనఁ గూడ ననౌచిత్యము భాసించుటలేదు.

ఈ హేతువువలన ప్రక్రమభేదదోషము భాసించుటలేదు. అంతమాత్రమున నచట దోషము లేదని చెప్పుటకు వీలులేదు. ప్రతీతిభేదము మాత్రమే యిచట దోషసద్భావములో హేతువుకాదు. దోషసద్భావము న్యాయసిద్ధముకూడను. కారణభేదమున్నపుడు కార్యభేదముండుట న్యాయసిద్ధము. ప్రస్తుతము భంగిభణితులు సమానముగా లేవు. విషమముగానున్నవి. విషమముగనున్న భంగిభణితిమార్గమున సంచరించు పాఠకుని ప్రతీతియందు పరిస్ఖలనము లేకుండుటెట్లు? భణితివైచిత్ర్యములు సమానముగనున్నచో ప్రతీతి యేకరూపముగనుండును. లేనిచో పరిస్ఖలనము నొందు ననుట న్యాయసిద్ధము.— కావున నిప్పటికి భణితి ప్రకారములన్నియు ప్రక్రమభేదదోషమునకు విషయములేయని తేలినది.— ఈ ప్రక్రమభేదముకూడ వాచ్యార్థనిష్ఠము ప్రతీయమానార్థ నిష్ఠమునని పరిశీలనవలన మనకుఁ దెలియును. అందుచేఁ బ్రక్రమభేదము శాబ్దము నార్థమునని రెండు విధములుగనున్నదని చెప్పితిమి.

వస్తుప్రక్రమభేదము.

ఇయంగేహే లక్ష్మీ రియ మమృతవ_ర్తి ర్నయనయోః
అసా వస్యా స్పర్శో వపుషి బహుళ శ్చందనరసః

అయం కంఠే బాహుఃశిశిరమసృణో మౌక్తికసరః
కి మస్యా స్రప్రేయో యది పర మసహ్యాస్తు విరహః

తా॥ ఈమె యింటిలో లక్ష్మి. నేత్రముల కమృతవర్తి. ఈమె యొక్క ఈస్పర్శ, శరీరమునకు గంధపు రసమే. నా కంఠమునందలి యీ బాహువు చల్లని, మెత్తని(నునుపగు)ము త్యాలహారము. ఈమెకు సంబంధించిన దేది ప్రియముగాదు ? కాని విరహముమాత్రము సహింపరానిది.

ఇచట మొదటిపాదమునందు సాక్షాన్నాయికాస్వరూపవర్ణన ముపక్రాన్తమైనది. తరువాతిపాదములలో నాయికయొక్క స్పర్శాదికము వర్ణితమైనది. వర్ణనీయ వస్తువర్తన మెట్లు ప్రారంభమైనదో యట్లే తుదివఱకు నుండకుండుటచే నిచట వస్తుప్రక్రమభేద దోషము వచ్చినది.

ప్రశ్న :- మొదటిపాదమునం దవయవి వర్ణితమైనది. మిగిలిన పాదములయం దవయవము వర్ణితమైనది. అందువలనఁగదా మీరు వస్తుప్రక్రమదోష మున్నదని వాదించుచున్నారు. కాని రెండుతావులందును నాయికా స్వరూప ప్రకర్షయే ప్రతీతమగుచున్నదిగదా !. అగునపుడు ప్రక్రమభేద దోషమెట్లువచ్చును ?

సమాధానము :- రెండుతావులందును, నేకరసప్రతీతికలిగి, ప్రతీతిపరిస్ఖలనము వలన వైరస్యముకలుగకున్నచో, మీరుచెప్పినది సత్య మయ్యెడిది. కాని యట్లు లేదని మేముచెప్పితిమిగదా ! అందుచే నిచట దోషమున్నది. "ముఖం పూర్ణ శ్చన్ద్రః వపు రమృతవర్తి ర్నయనయోః) అని పాఠమును మార్చినచో నాదోషముపోవును.

మఱియొక యుదాహరణము అలంకార ప్రక్రమ భంగము.
"తరంగయ దృశోంగనే! పతతు చిత్ర మిందీవరమ్
స్ఫుటీకురు రదచ్ఛదమ్ వ్రజతు విద్రుమః శ్వేతతామ్,

క్షణమ్ వపు రపావృణు స్పృశతు కాంచనమ్ కాలికామ్
ఉదంచయ మనాజ్ముఖమ్ భవతుచ ద్విచన్ద్రమ్ నభః"

అర్థము: అంగనే ఓ అబలా!; దృశః=చూపులను; తరంగయ=ప్రసరింపుము. (నేత్రములను తెరువుము.) చిత్రమ్,ఇందీవరమ్ =నల్లకలువ; పతతు=క్రిందికివెళ్ళుఁగాక; రదచ్ఛదమ్—పెదవిని, స్ఫుటీకురు=విప్పుము; విద్రుమః=చిగురుటాకు, శ్వేతతామ్,యాతు=తెలుపగుగాక; క్షణమ్=క్షణకాలము; వపుః=శరీరమును, అపావృణు=ఆచ్ఛాదనములేనిదానినిగఁ జేయుము; కాంచనమ్=బంగారము; కాలికామ్=దోషమును (నలుపును) స్పృశతు=తాకుఁగాక; ముఖమ్=ముఖమును; మనాక్=కొంచెము; ఉదంచయ=పైకెత్తుము, నభః=ఆకాశము; ద్విచన్ద్రమ్=ఇద్దఱుచంద్రులుగలది; భవతు=అగుఁగాక;

వివరణము:- నీనేత్రములను తెరువుము. నల్లకలువ క్రిందికి పడుఁగాక-ఇచట కను లుపమేయము, నల్లకలువ యుపమానము. నేత్రముల సౌందర్యము నల్లకలువసౌందర్యమును మించియున్నదని భావము. ఉపమానమగు నల్లకలువ నిందింపఁబడినది. తన్మూలమున నుపమేయమగు నేత్రముయొక్క సౌందర్యాతిశయము వర్ణితమైనది. అందుచే నిచట వ్యతిరేకాలంకారమున్నది. రెండు, మూఁడుపాదములలోఁగూడ నిట్లే, యుపమానములగు చిగురుటాకు, బంగారములు నిందింపఁబడి, యుపమేయములగు, పెదవి, శరీరముల సౌందర్యాతిశయము, నిరూపితమైనది. కాని నాల్గవపాదమునం దాకాశ మిద్దఱు చంద్రులు కలదగుఁగాక- అనియున్నది. ముఖమునకును, చంద్రునకును సాదృశ్యము వివక్షితమైననే యీవాక్యార్థము కుదురును. కావున నీవాక్యమున నుపమాలంకార మున్నది. వ్యతిరేకాలంకారముతో మొదలిడి, యుపమాలంకారముతో సమాప్తి చేయఁబడుటచే నిచటఁగూడ ప్రక్రమభేదదోషమున్నది. అందుచే,

"ఉదంచయ మహారాజ్ ముఖమ్ భవతు లక్ష్యలక్ష్మా ॥"

అని మార్చుచో నీముఖమును కొంచెమెత్తుము. చంద్రుఁడు కనఁబడుచున్న మచ్చగలవాఁడగుఁగాక- అనునర్థమువచ్చినాల్గవ పాదమునఁగూడ వ్యతిరేకాలంకారమే భాసించును.

మఱియొక యుదాహరణము:-

శ్లో॥ తద్వక్త్రం యది ముద్రితా శశికథా తచ్చేత్ స్మితమ్ కాసుధా
సాచేత్ కాన్తి రతన్త్రమేవ కనకమ్ తాశ్చేద్గిరో ధిఙ్ మధు
సా దృష్టి ర్యది హారితమ్ కువలయైః కింవా బహు బ్రూమహే
యత్ సత్యమ్ పునరుక్తవస్తువిరసః సర్గక్రమో వేధసః.

అర్థము:- తత్, వక్త్రమ్, యది=ఆముఖమున్నచో; శశికథా ముద్రితా=చంద్రుని ప్రసక్తి సమాప్తమయినది. చంద్రునితో నక్కఱ లేదనుట- చంద్రుఁడున్న ప్రయోజనము, ముఖమువలననే కలుగు చుండుటచే, చంద్రుఁ డనావశ్యకమని భావము, తత్, స్మితమ్, చేత్ = ఆనవ్వు, ఉన్నచో: కా, సుధా=అమృత మేల ?; సాకాన్తిః చేత్ = ఆకాన్తి యున్నచో; కనకమ్,అతన్త్రమేవ=బంగార మనావశ్యకము. తాః గిరఃచేత్ =ఆవాక్కులున్నచో; మధు ధిఙ్ = తేనె పనికిమాలి నదియే సాదృష్టిః యది=ఆచూపున్నచో; కువలయైః హారితమ్=కలు వలు నిష్ప్రయోజనమని భావము; కిం,వా,బహు,బ్రూమహే = అధిక ప్రసంగ మెందులకు?; (పెక్కుమాటలేల?) వేధసః,సర్గక్రమః= బ్రహ్మ దేవునియొక్క సృష్టిక్రమము; పునరుక్తవస్తువిరసః= పునరుక్తవస్తుభిః విరసః పునరుక్తవస్తువులచే విరసమైనది.సృష్టించిన వస్తువులనే సృష్టించు టచే విరసముగ నున్నది.

వివరణము:-ఇచట ఆమె ముఖమున్నచో చంద్రునికథ అణఁగి పోయినట్లే, ఆనవ్వున్నచో, అమృత మెందుకు? అనునపుడు ముఖము, నవ్వుల నుపమేయమునుగను చంద్రుఁడు,అమృతముల నుపమానముల

నతిశయించిన దని చెప్పుటచే వ్యతిరేకాలంకారము. 'యత్సత్యం పునరుక్త' అను నాల్గవపాదమున నర్థాంతరన్యాసముఁ జెప్పుటతోఁ బ్రక్రమ భేదము వచ్చినది. "పునరుక్త వస్తువిరసః"- వస్తుపునరుక్తి జరిగిన దని చెప్పటచే నుపమానోపమేయములకు సాదృశ్యమే సూచితమగును. కాని యుపమేయాధిక్యము సూచితముకాదు. సంపూర్ణ సాదృశ్యమున్నపుడే పునరుక్తమనియందుము. ఇట్లు మొదటిమూడుపాదములలో వ్యతిరేకము నాల్గవపాదమున సాదృశ్యము నుండుటచేఁ బ్రక్రమభంగ దోషమని చెప్పినాఁడు.

ఈదోషమును పరిహరించుటకు "పునరుక్తవస్తువిముఖః" అని మార్పవలయును. "పునరుక్తవస్తుషు విముఖః- పునరుక్త వస్తువులను సృష్టించుటయందు విముఖుఁడు కావున నే ముఖాదులకును చంద్రాదులకును భేదముండునట్లు సృష్టించినాఁడు. ముఖాదులు చంద్రాదుల నతిశయించియున్నవను వ్యతిరేకాలంకారభావ మీచివరపాదమునఁ గూడ భాసించుటచే దోషము పరిహృతమైనది. ఈదోషమిటువంటి యితరార్థదోషములకుఁగూడ నుపలక్షకముగా గ్రహింపవలయును.

మఱియొక యుదాహరణము: ప్రక్రమభంగము (విభక్తి)

"తపేన వర్షాః శరదా హిమాగమో వసన్తలక్ష్మ్యా, శిశిర స్సమేత్యచ
ప్రసూనకౢప్తిమ్ దధత స్సదర్తవః పురేஉస్య వాస్తవ్య కుటుంబితామ్
యయుః"

అర్థము:- తపేన=గ్రీష్మర్తువుతో, వర్షాః=వర్షర్తువు; శరదా=శరదృతువుతో, హిమాగమః=హిమముయొక్క రాక, (హేమంతర్తువు) వసన్తలక్ష్మ్యా=వసన్తలక్ష్మితో, (వసన్తర్తువుతో) శిశిరః, చ=శిశిరర్తువును, సమేత్య=కలసి, ప్రసూనకౢప్తిమ్=పుష్పములిచ్చుపనిని; సదా- ఎల్లప్పుడు; దధతః=వహించుచున్న, ఋతవః=ఋతువులు, అస్య,

పురే=ఇతని పట్టణమునందు, వాస్తవ్యకుటుంబితామ్ నిజముగ కాపుర ముండుటను, యయుః= పొందినవి.

వివరణము:- ఇచట ఋతువులు జంటలుజంటలుగా, మొత్తము మూఁడుజంటలుగాఁ జేర్కొనఁబడినవి. అందు మొదటిజంటలో మొదటి పదము తృతీయావిభక్తియందున్నది. పుమ్లింగము నందున్నది. "తపేన"; రెండవపదము ప్రథమావిభక్తిలో నున్నది. స్త్రీలింగము నందున్నది. (వర్షాః.) శ్లోకమిారీతి నుపక్రాన్తమైనది. ఇట్లే సమాప్తమగుచో బాగుండెడిది. కాని "శరదా హిమాగమః" అనునపుడు మొదటిపదము తృతీయావిభక్తియందున్నను పుల్లింగముకాదు. రెండవపదము కేవలము హేమంతర్తువును సాక్షాత్తుగాఁ జెప్పుటలేదు. హిమముయొక్క రాక యని చెప్పుచున్నది. మూఁడవ జంటయందుఁగూడ 'వసంతలక్ష్మ్యా' యని మొదటిపదము స్త్రీలింగమున నున్నది. ఇట్లు ప్రారంభించినరీతి, చివర నఱకును సాగలేదు. అందుచే నిచట క్రమప్రక్రమభేదమున్నది. [పూర్వము క్రమప్రక్రమ భేదమునకు "తవ కుసుమశరత్వమ్" అను శ్లోక ముదాహరణముగ నీయఁబడినది. దానికి బదులుగ నీశ్లోకము నుదాహరణముగ నిచ్చిన బాగుండెడిదని వ్యక్తివివేకవ్యాఖ్యానకర్త వ్రాసినాఁడు.] ప్రస్తుతమిాశ్లోకమునందలి దోషముపోవుటకై మొదటి జంటలోని పదములను మిగిలిన రెండు జంటలను తెల్పుపదముల కనురూపముగ నీక్రిందివిధముగ మార్చుట మంచిదని వ్యాఖ్యాతలు సూచించినారు.

"ఘన శ్రియోష్ణః శరదా హిమాగమః"

ఘనశ్రియా= మేఘలక్ష్మితో; ఉష్ణః=గ్రీష్మము: 'ఘనశ్రియా' యనునది తృతీయావిభక్తి-స్త్రీలింగము.- 'ఉష్ణః' ఇది పుల్లింగము ప్రథమావిభక్తి- ఇపుడు మూఁడుజంటలలోని పదములును నొకరీతిగనే యున్నవి.]

ప్రశ్న:- కర్తృప్రక్రమ భేదముగూడ నిచటఁ బ్రదర్శితము కాలే దెందువలన ?

సమాధానము: అసంభవమగుటవలన.- కొందఱి రచనములలో కర్తృవ్యత్యాసము కనుపడుచున్నను నది గుణమేగాని దోషము కాదు. అచటఁ బ్రక్రమభేద దోష మున్నదని మీరు భ్రమపడుచున్నారు. వాస్తవముగ లేదు. కర్తృవ్యత్యాసమునకును, ప్రక్రమ భేదమునకును, భేదమున్నది. వానిలక్షణములు పరస్పరభిన్నములు.

కర్తృవ్యత్యాసలక్షణము:-

"ప్రకృతమపి యత్రహిత్వా కర్తృత్వమ్ యుష్మదస్మదర్థస్య
చారుత్వా యాన్య త్రారోప్యేత గుణస్యతు న దోషః"

తా॥ ప్రస్తుతమునకు సంబంధించినను, యుష్మదస్మదర్థము యొక్క కర్తృత్వమునువదలి,సౌందర్యముకొఱకు యుష్మదస్మదర్థముల కంటె నితరమువందు కర్తృత్వము నారోపించుట కర్తృవ్యత్యాసమగును. అది గుణమేగాని దోషము కాదు.

ప్రక్రమభేదలక్షణము:-

యశ్చ యథా ప్రక్రాన్తోఽభిధా తుమర్థస్తథైవ తస్య నచేత్
నిర్వాహః స ప్రక్రమభేదో, న ప్రకరణావసితః-"

తా॥ ఒకయర్థము నెట్లుచెప్పుటకు మొదలిడినారో, యా యర్థమును చివరవఱ కావిధముగనే చెప్పకుండుట ప్రక్రమభేదమగును. ప్రస్తుతమునకు సంబంధించిన యుష్మదస్మదర్థకర్తృత్వమును యుష్మదస్మదర్థవాచకశబ్దములతోనే చెప్పకుండుట ప్రక్రమభేదమున కుదాహరణముగాదు. ఈవిధముగ వానిలక్షణములు భిన్నభిన్నములుగ నున్నవి. కావున కర్తృవ్యత్యాస స్థలమున ప్రక్రమభేదదోషము నాశంకించుట యుచితముకాదు.

యుష్మదర్థకర్తృవ్యత్యాసమున కుదాహరణము:-

యదాహ సప్తమో వైకుంఠావతార" ఇతి

"ఏడవ వైకుంఠావతారమని యతఁడు చెప్పినాఁడు. దాశరథియగు రాముని నెదుట నొకఁడుపలికినవాక్యము. ఇచట "నీవుచెప్పినట్లు" "యదాత్థత్వమ్" అనియుండవలయును. అందుకు బదులుగ నితఁడు చెప్పినట్లని యున్నది.

అస్మదర్థమున కుదాహరణము:-"నాభివాదన ప్రసాదో్య రేణుకాపుత్రః, గరీయాన్ హి గురుధనుర్భంగాపరాధః"- రేణుకాపుత్రుఁడు నమస్కారముచేఁ బ్రిసన్నుఁడు కాఁడు. గురుధనుర్భంగాపరాధము చాలగొప్పదికదా! ఇచట- 'నేను నమస్కారముచేఁ బ్రసన్నుఁడను కాను.' "నాభివాదన ప్రసాదో్యస్మి"- అని యుండవలయును. అట్లుండక రేణుకాపుత్రుఁడని ప్రథమపురుష-కర్తృత్వ ముపాత్తమైనది.- భార్గవ రాముఁడు తన్నుగుఱించి యనుకొనిన మాట లివి.

మఱియొక యుదాహరణము:

"అయం జనః ప్రష్టుమనా స్తపోధనే
న చేద్రహస్యమ్ ప్రతివక్తుమర్హసి"

అర్థము:- తపోధనే=ఓపార్వతీ అయం, జనః=ఈమనుష్యుఁడు ప్రిష్టుమనాః=అడుగవలెనని కుతూహలముతోనున్నాఁడు; రహస్యమ్ నచేత్=రహస్యముకానిచో; ప్రితివక్తుమ్=సమాధానము చెప్పుటకు అర్హసి=తగుదువు.

ఇచట "అహం ప్రిష్టుమనాః" నే నడుగవలెనని యనుకొనుచున్నానని యుండవలయును. అందుకు బదులుగ ఈమనుష్యుఁ డడుగ నెంచుచున్నాఁడని యున్నది.

యుష్మదస్మదర్థములకంటె నన్యశబ్దమనునది రెండువిధములుగ నుండును. (1) చేతనము. (2) అచేతనము. పైనిచ్చిన యుదాహరణములలో, రేణుకాపుత్రః అయమ్ జనః అనుకర్తలు చేతనములే. కావున

మొదటి భేదమున కివి యుదాహరణములు. చేతనకర్తృత్వము నచేతన ములయం దారోపించుటకు నుదాహరణములు—

"చాపాచార్యః పశుపతి రసౌ కార్తికేయో విజేయో
బాణవ్యస్తః సదన ముదధిః భూరి యమ్‌హ న్తకారః
అస్త్యేవైతత్ కిము కృతవతా రేణుకా కంఠబాధామ్
బద్ధస్పర్ధ స్తవ పరశునా లజ్జతే చన్ద్రహాసః"
(ఈశ్లోకమున కర్థము పూర్వమే యీయఁబడినది.)

రావణుఁడు పరశురామునితో నన్న మాటలు. "రేణుకాకంఠమునకు బాధను కలుగఁజేసిన నీతో కలహించుటకు నేను సిగ్గుపడు చున్నాను." అని యుండవలయును. అట్లనుటకు బదులు, "రేణుకా కంఠబాధామ్ కృతవతా బద్ధస్పర్ధః తవ పరశునా లజ్జతే చన్ద్రహాసః" రేణుకాకంఠమునకు బాధను కలుగఁజేసిన నీగొడ్డలితో, స్పర్ధను పెట్టు కొనినదై, నాచన్ద్రహాసము [ఆయుధము) సిగ్గుపడుచున్నది. అని రావ ణుఁ డనినాఁడు. నిజముగ నిచ్చట సిగ్గుపడుచున్న ది రావణుఁడు. అతఁడే యిచట కర్త. అటులే రేణుకాకంఠమునకు బాధను కలిగించినది పరశు రాముఁడు. బాధించుట యను క్రియ కతఁడే కర్త. కాని యీపద్యమున బాధనక్రియకు కర్త పరశువనియు, లజ్జించుట యనుక్రియకు కర్త చంద్ర హాసమనియు, వర్ణితమైనది. చేతనుల కర్తృత్వ మచేతనములయం దారోపితమైనది. ఈయారోపణమునకు ఫలము చారుత్వమే.

మఱియొక యుదాహరణము:-

"భోలంకేశ్వర! దీయతామ్ జనకజా, రామః స్వయంయాచతే,
కోయం తే మతివిభ్రమః, స్మర లయం, నాద్యాపి కించిత్ గతమ్
నైవంచేత్ ఖరదూషణ త్రిశిరసాం కంఠాసృజా పంకిలః
పత్రీ నైష సహిష్యతే మమ ధనుర్జ్యాబన్ధ బిందూకృతః"

తా॥ ఓ రావణా! సీత నిచ్చివేయుము.— రాముఁడు స్వయముగ

యాచించుచున్నాఁడు. నీ కీమతివిభ్రమ మేమి ? సీతని గుర్తుతెచ్చుకొనుము.– ఇప్పటికైనను ముంచుకుపోయినది లేదు. నీవు సీత నీయనిచో, ఖరుఁడు, దూషణుఁడు, త్రిశిరుఁడు ననురాక్షసుల కంఠరక్తముతో తడిసినట్టియు, ఎక్కుపెట్టబడినట్టిదియు నాయీ బాణము నిన్ను సహింపదు

ఇచ్చటఁగూడ 'నేను నిన్ను సహింపను.' అను టకుబదులు, నాయీ బాణము సహింపదని చెప్పినపుడు– చేతనకర్తృత్వ మచేతనముగా దారోపితమైనది. ('నేను యాచించుచున్నాను.' అను టకుబదులు రాముఁడు యాచించుచున్నాఁడనినపుడు, అస్మదర్థకర్తృత్వ మన్యత్రారోపితమైనది- యనియు గుర్తింపవలయును.)

క్రమభేదము:– తచ్ఛబ్దము

"తీర్థే తదీయే గజసేతుబన్ధాత్ ప్రతీపగా ముత్తరతోఽస్య గంగామ్"

అర్థము:- తదీయే,=ఆగంగాసంబంధమైన; తీర్థే=తీర్థమునందు; (రేవునందు) గజసేతుబన్ధాత్=ఏనుఁగులనెడు సేతువుయొక్క బన్ధము వలన; ప్రతీపగామ్ - ఎదురుగా(వెనుకకు ప్రవహించు, గంగామ్=గంగానదిని;–

వివరణము: ఒకవస్తువును ముందుచెప్పినతరువాత, రెండవపర్యాయ మావస్తువును 'తత్' శబ్దముతో పరామర్శించుట న్యాయ్యము కాని యిచట నింతకుఁబూర్వము గంగానదినిగుఱించి కవి చెప్పకయే. మొదటిసారిగనే "తదీయే" దానిసంబంధమైన,యని ప్రారంభించినాఁడు. దీనితరువాత గంగాశబ్దము ప్రాప్తమైనది– కావున నిచటపరామర్శనీయమగు వస్తువునుచెప్పకయే, "అది" యను సర్వనామముచే పరామర్శ జరిగినది. ఇదియే క్రమభేద మనుదోషము. (ఈవాదమునందలి సామంజస్యాసామంజస్యములు గ్రంథాన్తవిశేషవ్యాఖ్యలలోఁ జూడనగును.) ఇంతకుఁబూర్వము చెప్పఁబడినయర్థమే సర్వనామమునకు విషయమగునుగాని, చెప్పఁబోవునర్థము విషయ మెప్పుడునుగాదు. "అది" యను

ఆంధ్రసాహిత్యపరిషత్తు

తాత్కాలికాధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి. కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ మద్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహక సభ్యులు

శ్రీ కోకా శివనాథశాస్త్రి

శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ)

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)

శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

శ్రీ జయంతి బుచ్చిరామశాస్త్రి

డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)

శ్రీ చిరువోలు కోటీశ్వరరావు

శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.

శ్రీ వేదుల రామచంద్రకీర్తి, బి. ఏ. (హానర్సు)

శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)

శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు,

అడ్వకేటు, B.A., B.L. కాకినాడ.

పత్రికా సంపాదకుడు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

| | | |
|---|---|---|
| 1వ సంపుటము | ... | రు 6—0—0 |
| 2వ సంపుటము | ... | 6—0—0 |
| 3వ సంపుటము | ... | 6—0—0 |
| 4వ సంపుటము | ... | 6—0—0 |
| 5వ సంపుటము | ... | 10—0—0 |
| 6వ సంపుటము | ... | 10—0—0 |
| 7వ సంపుటము | ... | [ముద్రణములో నున్నది] |

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది వెల రు 1—50.

## మాధ్యమికకారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము. మూల్యము. రు 2—.50.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ.

Printed by J. Gopalam, B.A, L.T., at Republic Press, Kakinada
Edited by **C. PAPAIAHSASTRY**
Published by Andhra Sahitya Parishat, Kakinada.